చ. పొలతుక లెవ్విధిన్ గపట బోధలు సేసిరొ నాదుచిత్తమున్
దెలియగ నీవె కోపము గడించితొ నిక్కముగాదె నేరమో
లలనరొ! వెన్నకంటె మృదులంబగు నీ హృదయంబు వజ్రపున్
శిలవలె బల్కఠోరమును జెందగనేమి విచిత్రమిత్తరిన్. 80

శా. కందర్పాతిశయాంత మాగమము తర్కప్రక్రియం జూచి నీ
సౌందర్యద్యుతి మీద దృష్టిమిగుల న్సంధించి యామీద త్వ
న్మందాలాప సుధారసానుభవ సామ్రాజ్యంబునం దేలి 'యా
నందో బ్రహ్మము'గా మదిందలతు గాంతా తావకాశ్లేషమున్. 81

సీ. పడతి! నీ పొత్తున గుడువని దినమది
యుపరాగ దినముతో నుపమజేతు
చెలి! నీకు వీడ్యముల్ సలుపని వాసరం
బది హరివాసరంబని తలంతు
తరుణి! నీమోము చందురుని జూడని నిశి
నమవస నిశిగ భావమున నెంతు
రమణి! నీ యాలింగనము పొసంగని నాటి
యా రాత్రి శివరాత్రియని తలంతు

లెమ్ము రుచిభోజనమ్ముగానిమ్ము రమ్ము
కమ్మ కపురంపు విడెము గైకొమ్ము నమ్ము
కొమ్మ! నీవాడననుకొమ్ము నెమ్మొగమ్ము
నెమ్మి ముద్దిమ్ము నెర సమ్మదమ్ము గ్రమ్మ. 82

నా చెవి కింపునింపుచు మనం బలరింపుచు బల్కితేని ప్ర
జ్ఞాచతురత్వ మేరుపడ గ్రక్కున గూర్చెద నీయభీష్టముల్
దాచక నాకుదెల్పు విదితంబుగ నీమది బుట్టినట్టి యా
లోచన భీతశంబరవిలోచన మోహిత పద్మలోచనా! 83

చ. అవని చరించునట్టి సకలార్థులపేక్షను ధర్మయుక్తి గూ
ర్చి వినగ జెప్పుచున్న సవి జేసిన మాటలొకించుకేనియున్
జెవి సొరనీని మత్ప్రభుని చెల్వున నీవిటులూరకున్న మా
కవల యికేమి బుద్ధి ధవళాయతలోచన! వేగదెల్పవే. 84

చ. నను దయజూడు కొమ్మ! విడనాడకు" మంచు ముసుంగు కొంగు మె
ల్లన సడిలింపబోవ నదలింపుచు గృష్ణుని జూచి "యింకనై
సునె మరి నీ ప్రసంగములు సొన్పవు చాలు తొలంగు" మంచు గ
ర్జనమున బల్కి యంత నవసారసలోచన యూరకుండినన్ 85

ఉ. ఈ చెలి చిత్తవీథి నుదయించిన కోపభరంబు దీర్ప నే
యోచనయున్ ఘటింపదు నయోక్తులు పల్కిన వంచకంబులై
తోచినరీతి గన్పడియె దొయ్యలికిం బ్రణమిల్లుటే సదా
లోచన యంచు దత్పదవిలోకము జేయ బ్రయత్నుడౌనెడన్. 86

చ. అతని తలంపు తానెరిగి యప్పుడుబోణి హృదంతరాళ గుం
ఫితమగు చింతచే మిగుల భీతిలి చయ్యన గూరుచుండి "య
చ్యుత! యిటసేయవచ్చిన దుచోద్యములెల్లను గంటి నీవు నీ
చతురిమ భోజపుత్రికడ నల్పు" మనంగను శౌరియిట్లనెన్. 87

ఉ. "దోసములెన్నియైన గృపతో శమియింపుము నేప్రమాణమున్
జేసెదనీవు గోపమిక జేయకు నీదయవాడనేను నో
హో సఖి! లోకమెంచ వినవో యొక సామెత యుద్ధరాస్థతిన్
దాసరి తప్పు దండమున దప్పునటందురు పెద్దలందరున్." 88

వ. అనిన శ్రీకృష్ణునకు సత్యభామ యిట్లనియె. 89

—: సత్యభామ కృష్ణుని తూలనాడుట :—

క. "నీ లక్షణములు తెలియని
బేలనె యిటు జేరి యేల బెల్లించెదు మా
న్యాంగము [illegible]ముంచి గో
పాలా! [illegible] తెలియు హెంచితం[illegible]బుల్. 90

ఉ. ఏను వచింపనేల జగమెన్నును తావక సుప్రభావముల్
యేనుగు మచ్చికల్ మహి సహి ప్రణయంబులు కాలనేమి వి
జ్ఞానములున్ మృగభ్రమిత గానము లంబుతటీ బకాదిక
ధ్యానములున్ సృగాల వినయంబులు దేవరవారికే తగున్. 91

కల్లలు ముళ్ళ మాటలు మొగంబున నిచ్చకముల్మరుంగునన్
ఖుల్లక వాక్యముల్ బహుకుచోద్యము లిచ్చట నందరున్మెచే
పల్లవ పాణితో సరసభాషలు ప్రేమలు నీ కవశ్యముల్
పల్లవ కామినీ హృదయ వారిజనందన! నే నెరుంగనే. 92

చ. సరసిజనేత్ర! నీకిటు పొసంగిన కూర్మికి దేవ సంయమీ
శ్వరుడె తలంపసాక్షికల చందము దెల్పెద బంచదారతో
గరళము వంటి వర్తనము గాదొకొ తావక వాక్య పై ఖరుల్
సరియిక నీదువంచనలు సాగవు పొమ్మటు ధృష్టశేఖరా! 93

క. ఈ యుక్తులచే నాతో
నాయము ప్రకటింప నామనం బంరె జుమీ!
నీ యుపకృతులే కావా
సాయకముల వంటి ముని ప్రసంగము లెల్లన్. 94

చ. ముని యిటులన్వచింప జలముంగల రుక్మిణి యాంకింప నీ
వును గడు సమ్మతింప సరిబోటులు చాలహసింప మిక్కిలిన్
విని యటులన్సహింప నవివేకము నిన్నను వర్తనంబు చే
సినవిక జాలుచాలును రుచింపవు నీకపట ప్రియోక్తులున్. 95

చ. నిను ననునేల నారదముని న్వచియింపగనేల రుక్మిణిన్
గనలున దూరనేల గొరగాని దురుక్తుల నొందుచుండ నా
వనరుహసూతి నా నొసట వ్రాసిన వ్రాతప్రసంగ జెల్లగా
కనయము వీరి వార్నను టకక్కర యెందుకు గోపవల్లభా! 96

శా. స్తోత్రంబుల్ ముని రుక్మిణి ప్రలిపి నన్ దూషించువేళన్ భవ
ద్గాత్రంబున్ గడు హొంగగా ఎనగ వేడ్కల్ పుట్టెనా నీకు మా
సత్రాజిత్తున కీర్ష్యనాయెడ జనించెన్ బోలు లేకుండెనన్
గోత్రోత్పాట గుణాన్వితుండవగు నీకున్ నన్ను దానిచ్చునే. 97

ఉ. పోడి యొకింతలేని వలపుల్పచరించగరాకు కృష్ణ ! నీ
జాడలు జూడ రుక్మిణికొసంగిన వేలుపు పూవుతావి నా
మేడకు దెచ్చి యాపె యశమే వెలయింపుచు నన్ను సారెకున్
గోడిగమున్ ఘటించు కొరకున్ భవతాగమనంబు గన్పడెన్. 98

క. మొల్ల సుమగంధులగు నీ
యిల్లాండ్రకు నీకు మనసులింపుగ గన్నుల్
చల్లగగా నా పంతము
చెల్లించెద నేడు జూడు శీఘ్రమె శౌరీ! 99

సీ. ఈ చెల్మికత్తె లేయింటి పంచన బడి
యుండగా వలయునో యొదిగి యొదిగి
యీ సౌధమునను నే భాసురాంగికి సారె
క్రీడింప వలయునో వేడుకలర
నీ దివ్యమణి భూషణాదు లే సుందరి
పాలౌనొ యధిక సంభ్రమము మెరయ
నీ శుక శారికా పేశిజ సముదయం
బేరామకడ వసియింపవలెనొ

యహహా ! యస్మన్మహోద్యాన విహరణాతి
శయము లెవతెకు నీ తోడ సలుప నగునొ
యనఘ ! సవతులు నను గేలిగొనక మునుపె
పద్దు చెల్లింపుగాక నే భయములేక. 100

చను వక్కడ వగలిక్కడ
మనసందును లేనపోనిమాటలునిట నీ
పనులెరిగి మోసపోయితి
నిను                నాదె నేరము కృష్ణా!.                101

మ. శ్రవణంబుల్ సుఖమొందగా జిలుగు ముచ్చట్లాడగా నేర్తునో
యవిలంబంబున గూడనేర్తునొ ప్రమోదాపాదినై హావభా
వ విలాసాతి శయంబులొ సుమశర వ్యాపారముల్ జన్నిని
న్నవలీలన్ వలపించనేర్తు నాకా భోజాధీశ కన్యాగతిన్.                102

నేనీకు దగిన కాంతను
గానట బదియారువేల కన్యలు గలరం
చా నారదముని బల్కెడె
శ్రీ నాయక! వారి బెండ్లి జేకొనువేడ్కన్.                103

చ. మురహర! నీకు మిక్కిలిని మోహము బుట్టుటకేను రుక్మిణీ
సరసిజ పాణినో మిగులజాంబవదాత్మ జనో తలంపగా
ధరకుచ మిత్రవిందనొ సుదంతనొ భద్రనొ సూర్యపుత్రినో
సరసత గల్గు లక్షణనొ సారెకు నన్ను దలంప జెల్లునే.                104

సీ. భీష్మకాత్మజవలె ప్రియములు నేనేర
జాంబవత్సుతవలె సరసమెరుగ
కాళిందివలె సుఖకారిణి నేగాను
మతిమిత్రవింద సంగతులెరుంగ
భద్రవోలెను నిరుపద్రవస్థితి నేనేర
బంతమాలేదు సుదంతవలెను
లక్షణవలె నిష్కళంకను నే గాను
రాధకైవడి లేదు సాధువృత్తి

నుడువు బెదిరింపు సరసమా యడవిమృగము
యాతనలమేర పేరైతె నేతిబీర
కైక గుణములు గలదాన కఠిన మతిని
నిందితను పైకొనను నీదు నేనికేల. 105

శా. నిత్యంబు న్వసుదేవ దేవకులు మన్నింపంగ గారుణ్య సాం
గత్యంబు న్వెలయంగ నీవు నను సౌఖ్యంబొప్ప లాలింప నౌ
ద్ధత్యంబుందగగా సపత్నులలొ మోదంబందు నాకెప్పుడున్
బ్రీత్యాగంబగు వర్తనమును నెట్లింపా మనోవల్లభా! 106

శా. ఇంకన్నోమహపు టాంద్రతోడ బదివేలేండ్లున్మహారాజువై
శంకాతంకములేక నిస్తుల మహాసామ్రాజ్యమున్ బొంపుమన్
బంకే జాసన పట్టమేలు మిక గోపాలా! మదీయాప్తు లౌ
పంకేజాయత నేత్రలన్ శుకములన్ బాలించు హంసాదులన్.' 107

క. ఇటు హరిని దూరి మది న
క్కుటిలాలక కోపవహ్ని కుదురుపలేకా
రటపడి మారుంబల్కన్
ఓట మింతయులేక నినుమడించిన జాలిన్. 108

ఉ. తామస మోపలేక మదిధైర్యము త్రేల మునుంగుకొంగు నె
మ్మోమున మాటుచేసుకొని మోహనరాగ పలస్వనంబుతో
గోమలి యేడ్చెనప్డు యదుపుంగవుడు న్వదజాలిబుట్టగా
సామజకుంభ సన్నిభ కుచస్థలి నశ్రులు చాలువారగన్. 109

ఉ. అప్పుడు కైటభారి దయనంగన నయ్యనజేర్చి [illegible]
మప్పటి కొంగుతో గనుల తోయకణంబులు [illegible]
బొప్పు శిరంబు మువ్వ కరుణోజ్జ్వలుడై ఘన సమ్మదాప్తితో
[illegible] 110

"అండజయాన! నామదికి నద్భుతమయ్యెను మున్ను నెన్న పె
ట్లుండవు పుష్పమాత్రమునకో విను మెంతటికైన నీకు నే
నుండగ జింత నీ పగిది నొందగ జెల్లునె పోయి తెత్తునా
ఖండలునైన గెల్చి త్వరగా సురభూజమదెంత కార్యమే. 111

తెచ్చి యుష్మద్గృహారామ దేశమధ్య
మున బ్రతిష్ఠించి నీ మనమునకు బ్రీతి
సేయుదుము నీవు కడు చింత చేయవలదు
చారుగుణధామ! నమ్ము మీ సత్యభామ!" 112

ఉ. అమ్మురఘస్మరుండిటుల నానతి యిచ్చిన మేల్ ప్రతిజ్ఞచే
నెమ్మది జింతబోవిడిచి నిండెను గోర్కులటించు నప్పుడున్
సమ్మద మొందు సత్యముఖచంద్ర వికాసముచే సఖీచకో
రమ్ముల కేళికాధిక భరమ్ములు మించె విచిత్ర వైఖరిన్. 113

వ. అప్పుడు. 114

మ. ఒగి దిక్పాలక కర్ణదేశ బధిరోద్యోగంబుగా మ్రోసె నా
ఖగరాజ ధ్వజ మందిరోపరి మహాఘంటానినాదంబు మ
ధ్య గతుండయ్యెను బద్మమిత్రుడిక స్నానాది క్రియల్సల్పలె
మ్మగవైరి స్తుత! యంచు సారెకు వదాహ్వానంబు చందంబునన్. 115

ఉ. ఆ సమయంబునందు గమలాయతలోచను డర్హకృత్యముల్
దా సలుపన్ దలంచిన విధంబుగనుంగొని సత్యభామ యుచ
ల్లాసమొనర్పగా బని మెలంతలకుం గనుసైగ సేయగా
నా సఖులంతటన్ జలకమాడగ శౌరికి విన్నవించినన్. 116

## —: శ్రీకృష్ణ సత్యభామల స్నానాదికము :-

గీ. అంబుజాక్షుడు సత్యముఖంబు జూచి
కలికిరో! నీవు జలకంబు సలుపుమనుచు
బలుక నిద్దరు కైదండల లవరించి
స్నానశాలకు నేతెంచి సంభ్రమమున. 117

ఆ. రత్నపీఠమునను రాజీవ నేత్రుని
గూరుచుండ బెట్టి కీరవాణి
యాడిగంపు జెలుల కుచిత పూజలు సల్ప
దనుచు జెప్పి చనియె నంతిపురికి. 118

క. హరి ధరియించిన మణిమయ
వర దివ్య విభూషణములు వదలించెను సుం
దరి యొకతె తక్షణంబున
శిరసున కభ్యంజనంబు సేయు తలంపునన్. 119

మ. సరులల్లాడగ గొప్పువీడ గుచముల్సందీక పోరాడ గే
సరితోబోరు నుదారపుంగవును భాస్వల్లీల జవ్వాడగా
గర పద్మంపు మరందమాని కచభృంగంబు ల్విరాజిల్లు పై
ఖరిదోపన్ శిరసంటె మాధవునకా కంజాక్షి సంపంగ తై
ల రసభ్రాజిత మస్తకస్థలికి నుల్లాసంబు గల్పించుచున్. 120

చ. మృగమదమున్ జవాజియు సమేళనమౌ హరి చందనంబుతో
సొగసుగ యాదవేంద్రునకు సుందరి యొక్కతె సల్గుబెట్టినన్
దగెన శరీరకాంతుల విధంబపుడేమని చెప్పవచ్చు బా
గుగ నల యింద్రనీలమునకున్ గరసాన ఘటించెనోయనన్ 121

క. గంధామలకంబిడె నొక
గంధేభ ప్రవరయాన కాళీయ ఫణా
దింధిమిత ధిమిత నాట్యోద్ధు
రంధరునకు యుద్ధజిత జరాసంధునకున్. 122

సీ. ప్రకట యాతాయాత పదమంజు మంజీర
ఘణఘణత్కార జృంభణము మెరయ
కటిపటాంతతటీ మణిదివ్యభూషణ
ప్రకరకాంతిచ్ఛటల్ ప్రబ్బికొనగ

స్థిర శరచ్చంద్రికాకర మృదులాంబరా
ధిక విశుభ్రపయ్యొతుల్దిశలగప్ప
జలకుంభ ధృతకర జలరుహ భూషిత
కంకణ క్రేంకార కలన చనర

శాతకుంభ కుంభ సంభృతాఖిలనదీ
జలము సముచితోష్ణమలరజేసి
చెలువ లందియివ్వ జెలగి శ్రీహరికిని
జలకమార్చె నొక్క చంద్రవదన. 123

తడి యొత్తెనపుడు మరుత
త్తడి బోలిన మెలతయొకతె దైత్యారికి బు
త్తడి వన్నె చేలచే నొ
త్తడి బడకుండంగ మృదులత న్విలసిల్లన్. 124

విరిబోణి యొకతె వెన్నెం
దొరపిల్లలవంటి మెరుగు తొరపు గోళ్ళన్
గరమొప్ప దువ్వి నేర్పున
సిరులు దొలుకు నెరుల కపుడు చిక్కులు బాపెన్. 125

గీ. అంగన యొకర్తె బంగరు రంగులడర
చుంగులు పొసంగగ దిద్ది తురంగటకును
హరిదళము కాంతి గేరెడు నంబరములు
దెచ్చి యందిచ్చె సలదేవదేవునకును. 126

సిరిమెరయన్ గడాని పనిచే విలసిల్లెడు నూత్నరత్న నూ
పుర కటిసూత్ర హారకరభూష శుభాంగద కర్ణకుండలా
స్ఫురితకిరీట ముఖ్య వరభూషణముల్ ధరింపజెసె సుం
దరముగ వాసుదేవునకు దన్వి యొకర్తె విలాసవైఖరిన్. 127

గంధమలందె నొక్కచెలి కస్తురినామము దిద్దె ముద్దుగా
నిందునిభాస్యయొర్తు పువుడెత్తులురస్థలి దాల్పజేసె నిం
దిందిరవేణి యొక్కతె ద్యుతింగస నద్దముదెచ్చి నిల్పె గో
విందుని చిత్తముల్లసిలు వేడుక నొక్క వధూటి ప్రేమతోన్. 128

ఆ. రత్న పీఠమిడి వినూత్న జలంబులు
హైమ పాత్రికలను నతివలిడగ
బద్మలోచనుండు పగటి సంధ్యావంద
నంబు దేవతార్చనలు నొనర్చె. 129

ఉ. అప్పుడు సత్యభామ జలమాడి శుభాంబరముం ధరించి బ
ల్మెప్పగు రత్నభూషలును మేనఁ నమర్చి లలాటసీమ సొం
పొప్పగ జుక్కబొట్టిడి పయోజదళావళి గొప్పుజేర్చిమేల్
కప్పుర వాసన ల్వొలయ గాళియ భేదిని జేరవచ్చినన్. 130

వీరమోహినివలె దను జేరినట్టి
సారసాక్షిని సత్కృపా గౌరవమున
నింపుమణి పీఠిపై వసియింప జేసి
సరస వాక్ప్రౌఢిమల నొప్పు సమయమునను. 131

—: **ఇంద్రా గమనము** :—

మందారమాలా మరందతుందిల సురేం
దిందిరఝుంకృతుల్ గ్రందుకొనగ
మకుటాది భూషణ నికరమణీ విభా
చకచకల్ రవి మరీచికల గప్ప
శ్రీణిత్రింశత్కోటి గాణిత ప్రబల గీ
ర్వాణ యోధావరశ్రేణి గొల్వ
కేళీవిజిత పర్వతాళీ నిపాత దం
భోళి విస్తృత బాహుపాళి మెరయ

సితకరీంద్రమునెక్కి సన్నుత విభూతి
ద్వారవతి జనుల్ చూడ దుర్వారభక్తి
వేయికన్నుల నానంద తోయమంద
నింద్రుడేతెంచె నల యాదవేంద్రుగనగ. 132

క. ఏతెంచిన బలవైరిని
జేతో మోదంబు తోడ శ్రీహరి కరుణా
న్వీతుడయి చూచు చుండగ
నాతడు హరిపాద జలరుహద్వయి చెంతన్. 132

క. సంతసము తోడ నల వృ
త్రాంతకు డసురారి గూర్చి "యాద్యాయ నమ
శ్శాంతాయ ముని మనోజ్ఞని
శాంతాయ నమో" యటంచు జాగిలి మ్రొక్కెన్. 134

క. మ్రొక్కిన లే లెమ్మని హరి
మక్కువతో బలుకలేచి మది స్రుక్కుచు దా
నిక్కరణి బొగడె బలరిపు
డక్కమలా విభుని జూచి యందరు వినగన్. 135

సీ. "జయ విదర్భావనీశ్వర కన్యకాలోల!
సరస సాత్రాజితీ సురతలీల!
జాంబవతీముఖ షట్సతీ పాంచాల!
సంక్రంద నోపల శకల నీల!
మణి కుండల ప్రభా మండిత సుకపోల!
భక్తలోకైక కృపావిశాల!
సకల వేదాంతార్థ సన్నుత గుణ జాల!
కాంతి విభాసిత కనక చేల!

ముని హృదయ ఖేల! దనుజ దుర్జన విఫాల!
కాంతి యుతఫాల! వరసామగానలోల!
మధుర వాగ్జాల! నిర్జిత మగధ పాల!
భవ్యతరశీల! నందగోపాల బాల! 136

సీ. దండంబు నీకిదె కుండలీశ్వర ఫణా
మండలీ తాండవోద్దండ లీల!
వందనం బిదెనీకు బృందావనాంత గో
బృందావనామితానంద ఖేల!
సేవింపు నీకిదె సేవకలోక సం
జీవన దాన ప్రభావ జాల!
సాష్టాంగమిదె నీకు దుష్టదానవ మదా
నష్టంబ వారణోత్కృష్ట లీల!

మ్రొక్కు నీకిదె మముగావ దిక్కునీవె
మౌని మానసకాసార మదమరాళ!
కలిత దుగ్ధాబ్ధి మణిశాల! కనకచేల!
భవ్యతరశీల! నందగోపాలబాల! 137

క. లీలం దశరూపములు
ద్వేల గతిందాల్చి ధరణి వెలసిన హరి! యో
లీలామానుష విగ్రహ!
పాలింపవె నన్ను లోకపావన! కృష్ణా! 138

క. ధరణీసుతుడగు నరకా
సురుడమరావతికి వచ్చి శూరత నఖిలా
మరుల జయించె హరించెను
వరుణచ్ఛత్రంబు నదితివరకుండలముల్." 139

క. అని విన్నపమొనరించిన
విని చక్రధరుండు "నీకు వెరపేటికి స
య్యన వాని ద్రుంచి నీమది
కనుమోదమొనర్తునో బలాంతక! మరియున్. 140

చ. శతమఖ! తావకాగమన సంగతితోడ ముదంబుగల్గె మా
కతిథివి నేడు నీవిచట సంచితవీల భుజింపగాదగున్
క్షితిసుత కార్యమెంత నతిశీఘ్రముగా పధియింతువాని నీ
మతిని నొకింత సంశయము మాను" మటంచు కరంబు బటినన్. 141

## —: విందు భోజనము :—

ఉ. ద్వారవతీశ భాగ్యమని ధారుణిసోకగ మ్రొక్కి సారెగై
వారము సేయుచుం ద్రిదశవారము గొల్వగజేరె భోజనా
గారము కృష్ణువెంబడి నగారి విదోహస శుద్ధ వస్త్ర సం
ధారణలాదిగా గల విధానములుం దగసల్పె వేడుకన్. 142

గీ. అపుడు నిర్జర సహితుడై యలరుచున్న
కృష్ణు ననుమతి తలమోచి కెలకులందు
జాణతనమున విలసిల్లు సత్యభామ
నిలయమున గల్గు పరిచారికలు ముదమున. 143

సీ. భోజన శాలార్హ భూరి పీఠములపై
ప్రియముతో గూర్చుండ బెట్టువారు
నవరత్న ఖచిత సుందరములైన పసింపి
కంచముల్ పంక్తిగ నుంచువారు
కొమరు పానీయాల్పు కుంభము ల్వెసదెచ్చి
వలపటి చక్కటం నిలుపువారు
బహుశాకపాకముల్ పచ్చళ్ళు నూరుబిం
డ్లూరుగాయలు గొని చేరువారు

పంచ భక్ష్యాన్నములను వడ్డించువారు
తెలివి కమ్మని ఘృతములు తెచ్చువార
లగుచు సాత్రాజితీ సఖులతిశయమున
మెలగసాగిరి భోజన నిలయమునను.. 144

వ. అపుడు సాత్రాజితీవల్లభుండు పులోమజానాయకాది దిక్పాలక వర్గంబునుం
గనుంగొని యిట్లనియె.

సీ. "అమరేశ! యీయపూపము చవిగొంచుమా
ఘృతము గైకొను సదాగతి సుమిత్ర!
పరమాన్నమింపు సొంపరయు వైవస్వత
కోణప! పచ్చళ్ళ కొమరుగనుము
యాదసాంపతి! రసాయనము జూడు సపాదు
లనిల! సువాసనోదనము గొనుము
పౌలస్త్య! వలసిన భక్ష్యముల్ గోరుమ
ఈశాన! తీయబారింపు జూడు"
మనుచు బహుభోజ్యముల రుచుల్సనయమునను
దెల్పుచును వేడ్కమీరంగ దేవతలను
గూడి సరసంపు ముచ్చట లాడుకొనుచు
కోరికలు మీర శ్రీకృష్ణు డారగించెః 146

పొగచిన కూరగుంపుం బ్రపూర్ణరుచుల్గొనియాడు వారలిం
పగు మిరియంపు చారులహహా యని సన్నుతి జేయువారు మె
చ్చగ దగు పిండివంటలు వెసంజవి చూచి భుజించువారలై
గగనచరు ల్మురారి సముఖంబున మించిరి సమ్మదంబునన్. 147

కొంపిగల జలధిలో జని
యింపుట నేకరుచిచేత నిరవొందుట యా
సొంపెంత యనుచు సుధ నిర
సింపుచు సరసాన్నములు భుజించి రమర్త్యుల్. 148

ఈరీతి హరియు నిర్జర
వీరులు భుజియించి యంతవేడ్కఁ దలిర్పన్
సార సుగంధాంబులు శృం
గార వతులొసంగ ధౌతకర పంకజులై. 149

ఉడురాజ శిలాజగతిన్
విడిదిగ గూర్చుండబెట్టి వేడుక లలరన్
విడెము లొసగించె గృష్ణుడు
కడు సొగసుగ జాలవల్లికల పడతుల చేన్. 150

కమ్మని పలుకుల వారికి
కొమ్మని యుడుగర లొసంగి గురుతర లీలన్
సమ్మతి బంపిన సురనిక
రమ్ములు నమరావతీ పురమ్మున కేగన్. 151

గీ. అపుడు సత్యాసమేతుడై హరి వినోద
కేళి సలుపుచు గూర్చున్న వేళయందు
దినకరుడు వారుణీ సేవకును జెలంగు
తీరునను జేరె నస్తాద్రి చేరువకును. 152

### —: సాయంకాల వర్ణనము :—

సీ. కిరణ శృంగాళిచే నరుణాభికుడు ధరా
కాంతపై జిల్కు వసంతమనగ
నస్తాద్రివృక్ష ప్రశస్తమై విలసిల్లు
రవిజపాపుష్ప పరాగమనగ
సూరమాష్టికు డంధకార దంతిని బట్ట
బెంపుజేసిన నసజొంపమనగ
వరుణ దిగంగనా వరశిరస్థలి దాల్చు
భాస్వన్మణి ప్రభాపటలమనగ

ససమతర దాడిమ పలాశకుసుమ విసర
ఘుసృణ విద్రుమ బిసరుహకుంజ పుంజ
మంజు రంజన కరమయ్యె మారుమసలె
నరుణ జరఠాతపంబు భాసురముగాగ. 153

క. తోయజ బాంధవు డరుణ
చ్ఛాయన్విలసిల్లె నపరశైలము నందున్
సాయం సంధ్యాసుందరి
పాయసము భుజించు పైడి పళ్ళెరమనగన్. 154

సీ. గాఢాంధకార రాక్షసవల్లభుడు వెంట
బడిపట్టుకొనునను భయముగలిగొ
చక్రవాకవిహంగ చక్రవియోగార్తి
జూడలేననునట్టి శోకమొదవొ
దూరాగతాయాస భూరినిద్రారతి
గ్రుంకుమెట్టను శయ్యగున్కటకునొ
పరరాజ పరకర ప్రాప్తమౌ నిజపదం
బనుచింత దూగెడు మనసు పొడమొ

యని జనులు సంశయాత్ములై గనుగొనంగ
నధిక ప్రభదూలి కడుజాలి నంశుమాలి
విహరణము చాలి పశ్చిమ వీచిమాలి
యందు గందువ మీరగా నసమించె. 155

మ. కమలంబుల్ముకుళించె గోకముల దుఃఖధ్యానమున్మించె మా
రమదోద్రేకము సందడించె నుడువారంబుల్ప్రకాసించె జా
రమనంబుల్ హరిషించె గైరవజయారంభంబు బ్రాపించె సం
తమసస్తోమము బొంచె వాసరము మార్తాండుండు చెల్లించినన్. 156

క. పులుగమి గూళ్ళంజేరెను
జలజంబుల కలిమిజారె జక్కవకవలున్
వెలవెలకబారె కలువల
కళలూరె చకోరసమితి గర్వము మీరెన్. 157

క. తరుణ హరిత్సతి లీలా
పరిచితిచే నంతరిక్షపల్లవికునిపై
నరుణరుచి రసము జిమ్మిన
కరణిన్సంధ్యాతిరాగ కలన దనర్చెన్. 158

సీ. పశ్చిమాంబుధిగత పాతాళ సుచిరత్న
ఫణిఫణారత్న ప్రభాపటలమొ
సమయాఢ్యనిష్కుట సముదంకురితదళ
మహితశోణాశోక మండలంబొ
వారుణి ద్వీప సంభవ శుంభదుత్తాల
సరసవిద్రుమ లతా సముదయంబొ
విరహిజన జనాభిసరణ మీనాంక కృ
ద్ఘనరక్త పటకుటికానిచయమొ

తపన హయపంక్తి ఖుర తాడితావ ధూత
శాతకుంభాభ నూతన ధాతురాగ
జాత చరమాద్రి భవక రజప్రకరమొ
యన మెరసె సంధ్య విటవిటీ జనములెన్న. 159

—:అంధకార వర్ణనము :—

ఉ. చింతల వేగి యొంటిగ వసించి పరస్పర దర్శనాప్తి ధీ
మంతులు నౌ విటీవిటుల మానధనాపహృతార్థి యైన యా
కంతుని మాయముచ్చు పొడికైవడి మిక్కిలి కారుక్రమ్ముచున్
ధ్వాంతము నిండ బర్వె వసుధాస్థలిపై దశదిక్ప్రగూఢమై. 160

క. విరహిజన గహన దాహన
సరభస మద మదన దహన సంజనిత మహా
పరిమిత ధూమము లోయన
ధరణీ గగనాంతరముల దమములు పర్వెన్. 161

సీ. ఇదిగదా ముదివార సుదతుల కెలఁబాయ
మొదవించు మదనుని మృదుచికిత్స
యిది సుమీ సదనాళిబొదలు సంపద గొన
మెదలు ప్రల్లదులకు మొదటి చుట్ట
మిది సుమీ యరపడి వదనముల్గలవాని
బెదిరింపజాలు బెట్టిదపు విసము
నిదిమె నా లేబద నదికించి కన్నులం
గదియింప నదనైన కజ్జలంబు

నిదియెకా ముదమెదనించి మదవతులకు
గొదమ విటులకు సదయత లెద్దగజేయు
నిదియు నుపకార పదమంచు మది దలంచి
కులటలెన్నంగ దిమిరంపు గుంపు మెరసె. 162

క. పుష్కరమునం దమఃకరి
పుష్కరసద జలము లాని భూత్కృతి జిమ్మన్
బుష్కరమున కెగసిన సిత
పుష్కర బిందువులనంగ బొదలెం దారల్. 163

క. ద్యోరమణి తమః కబరీ
భారమునం దాల్చినట్టి బలుముత్తెములన్
పేరిన దామకమోయన
తారావళి మెరసె నధిక ధవళ ద్యుతులన్. 164

వ. ఆ సమయంబున. 165

సీ. ఒక ఎటసంకేత మొకకాంత చేరివే
రొకడౌట గనక పుచ్చిక బెనంగు
నొకనాతి ప్రీతి వేరొకని యొద్దికి బోవ
గికురించి యొకడు సందుగొని కవయు
మకరాంకకేళి భర్తరుసౌఖ్య మిట్టించి
యొకలేమ తగుపల్లవికుల బొదవు
నొకని పిల్వగబంచి యొకచోట నుంచి వే
రొకనితో నొకతె యొద్దిక జరించు

భూరి గాఢాంధ కామాంధములు సహాయ
మగుచు తమువేగిరింపగా నిగురు బోండ్లు
సొగసు కాంత్రడను దొగతూపు శూరువగల
వేచి తిరుగుచు రన్నిశివేళమందు. 166

సర్వకులటాంగనలకున్
దుర్వహమై మిగుల భయము దోచగ గళలుం
బర్వగ జీకటి విరియగ
బర్వేందుండుదయ శిఖరిపై నుదయించెన్. 167

క. మదన క్ష్మాపతి లీలా
స్పదమతి నుదయాద్రికృతక శైలస్థితుడై
చదలునకు విడువ నాడన్
గనిన తెల్లిగ్రద్ద పడుచుగతి శశి మెరసెన్. 168

సురలకు విందు పొందు తొగచోటికి రేటికిపట్టు గట్టు కూ
తురుచారణొమ్ము వమ్ము వెలివొంగిన గంగకుదివి రావితా
పురలకు కీడు చోడుహరిమూలకు రేపుకుమేర కారణా
చరులకు ముప్పు మెప్పుగురుజాయకు నాయకుడొందె ముందెసన్. 169

మనసిజదేవ మహోత్సవ
మొనరింప నిశావధూటి యురు విభవముగన్
వనరుహ భవాండ భవనం
బునకిడు గచ్చనగ మెరసె బూర్ణజ్యోత్స్నల్. 170

వ. వెండియు నప్పుండరీక మండలంబున దండిమెరసి వర్షించు పండువెన్నెల లజాండకరండంబునందు సుమమోరవ్యందు పిచంగిలంబుగా నిండించు కర్పూరాఖండ పాండిత్యంబు సంగీకరించుచు, ఖండపరశు చండత రాట్టహాసంబులు రసాస్థలంబున వెదజల్లిన విధంబునం భాసిల్లుచు, నఖండలత వేసండరాజ రాజవతంస మండల దండాహతార్క ప్రకాండ పాండిమంబు బెండు వడజేయుచు, నక్షీణధ్వాంత రక్షోవల్లభ విక్షోభన దక్ష శశి నృహార్యక్షోదయరాగ రక్త సిక్తాంగ ప్రక్షాళన విచక్షణ త్ర్యక్ష విధి హరిముఖ సురాధ్యక్ష విరచితాంతరిక్షధునీ ప్రవాహ పూరంబులన విడంబించుచు, నిఖిల తరుజాలంబుల సురసాలంబుల పోల్కిం గను పట్టజేయుచు, కైరవంబులకు సంతోషపూరంబు మేర మీరన్ ఘటియింపుచు, బహుళక్షుధార్తి చకోరార్తి సమాజంబులకు బుభుక్షాస్ఫూర్తి నిర్వర్తిల్ల జేయుచు, నిందుకాంత సౌధధరాధరంబులపై సెలయేటి మొత్తంబులు జలజల ప్రవహింపజేయుచు విశ్వవిశ్వంభరా వ్యాపకంబై శోభిల్లె; నయ్యెడ వెడవిల్కాడు చిడిముడిపాటున దుముకడర జెరుకుగడవింట వెడవెడ సడరించు చెడివంపు టంపరలకు సుడిబడి గడగడ వడంకు పడతుల మచ్చిక నుడువుల నెనరు గడలొత్త లాలించు గడుసు విటులును, విటజన చిత్త రంజనాయత్త చిత్తజాత వికార సంభూత కిలకించితాది శృంగార భావచేష్టా విరాజమాన భువనమోహన వనతులగు జారసతులును, సతులకును వసతులకు నితరేతరస్నేహాతిశయంబులు వితతంబుగా సతికించు చతుర వాక్ప్రతతుల నతిప్రౌఢలై యానుగోవులగతి మితరహితంబుగా జరియించు శంభళీసతులును, వసకులగు సంకేత స్థలంబుల ప్రాణసమానులగు భుజంగుల నిలువ నియోగించి కస్తూర మిళిత పాటీర పంకంబులు పొంకంబులుగా నెమ్మేనులగలయ నలందుకొని యతి మృదుల ధవళపరిధాన ధారిణులై ప్రవ్యక్త ముక్త

దామంబులు నవవికసిత మల్లికా కుసుమమాలికలు నిబ్బరంబుగా బ్రబ్బికొని యుబ్బరంబగు శిబ్బెపుగబ్బి గుబ్బలపై నర్తనంబులు సలుప, నిగనిగయను బిగిగల మగరాల నిగుడించిన తాటకంబుల దీప్తులు విరహధవళిత కపోల ప్రకాశంబులు స్మిత చంద్రికలు ముప్పిరిగొన నిజనివాసంబులు వెడలి సొంగంబులైన చంద్రదళల హొలుపున బ్రాణవల్లభుల నుద్దేసించి చను నభిసారికా కదంబములును, కదంబ తాలహింతాల ఖర్జూర నారికేళ తరుజనిత మధురసంబులు పటికంపు గిన్నెల మెరుంగు నెలరాచిప్పల మదికాసుకోరల పూరంబుగా నించి మించిన వేడుకలలర వంచకంబున తనయనుంగు సంచయానలకు గింపుదనంబున నిచ్చిన హాలాపానమదంబున తబ్బిబ్బు మాటలాడు బిబ్బోకవతుల యధరంబు సుధలుగొని యుబ్బిన చనుగుబ్బలు తమయురంబు లదరంగ గౌగిలించి చౌశీతి బంధంబులన్ గ్రీడించు పల్లవశిఖామణులును, మణిస్థగితంబులై హంసతూలికా కల్పితంబులగు పర్యంకంబుల మీనాంక కేళిదేలి, తూగుటుయ్యెలం జేరి యరమోడ్పు కనుంగవలతో నిద్రించు వధూవరులును, వయోవరులు నింద్రనీలకుట్టిమ ప్రదేశంబుల బ్రతిఫలిత ఋక్షంబులు రంగస్థలాలంకృత ప్రసూనంబులం విధంబుల భాసిల్ల మృదంగతాళ వీణావేణు విశేష వాద్యంబులు మధురంబులుగా మెరయ సరస సంగీత లాస్య ప్రవీణలై మెరయు వారకామినీ జనంబులతో వర్తించు సరసులును, సరసుల గల కుముద సముదయంబులపై దత్పరాగంబురేచి మరందపాన పరవశ భృంగంబులనేచి రాచనడకల కలధౌత సువర్ణమయ సౌధంబులపై డాసి లోచనానందకరులైన తరుణీతరుణుల రతిశ్రమంబపనయించు మృదుమందమలయానిలంబులును, మలయానిల చలద్ధళ గోస్తనీకాయమానంబులం బ్రవేశించి తద్వివరంబులం జొరబారి యధోభాగంబులం గనుంగొని పంతంబున బ్రేటులాడు కంతుని మత్తదంతులుబోలిన కాంతానికరంబులును, నికరంబులగు ముకుర ప్రకరంబులగేరు సుకపోలంబులంగల శుకవాణుల చిబుక బంధంబులపై జికిలిగల మకరకేతను శరమ్ముల సరమ్ములు సుమహారమ్ములుగా నలంకరించు రాజకుమారకులును, సుకుమార సుస్నిగ్ధ రూపవయోవంతులైన నిజకాంతుల కౌగిలింతలు సడలునను నురంత

చింతాస్ఫూర్తంబులచే నిశాంత సమయం బగుటను దెరచు పద్మినీజాతి కాంతా సముదయంబులును, సముదయ రాగరసపోషకులై నాయక సహచరులగు పీఠమర్ద విదూషకలోక కళావిలాసంబులును, విలాస విలాసినీజన మహోల్లాస భాసమాన చతుర భాషావిశేషాతిశయంబుల నయంబులైన ప్రసంగంబులుం గలిగి యనంగరాజు మహదైశ్వర్యంబు చందంబున విరాజిల్లు నాసమయంబున వాసుదేవుండును సాత్రాజితియును ననర్ఘగారుత్మత రత్న చిత్ర స్తంభ విభ్రాజితంబును, మహేంద్రనీల వజ్రవిద్రుమ విశాల స్థూలం జాలంబును, నవమణిగణఖచిత కళాశాస్త్ర రచిత బౌళీతిబంధ సుందర సాలభంజి కాపుంజరంజిత కుడ్య ప్రదేశంబును, వివిధ విచిత్రాంబరబద్ధ నిర్మల ముక్తామయ గుళుచ్ఛాలంబిత నూతన వితానంబును, దేదీప్యమానదివ్యమణిదీప దీపితంబును, ధగద్ధగాయమాన నిష్కలంక ప్రభావిభాసిత పురుషప్రమాణ దర్పణ విలసితంబును, మృగమద సంకుమద కర్పూర చందనాది నానావిధ పరిమళాధిష్ఠిత పద్మరాగమణి పేటికా సమేతంబును, పారావత పతగ ద్వితయ కూజితంబును, గనక పంజరాంతస్థ మధురాలాప శుకవినోదితంబును, పరిచారికామణి ప్రతిమాభిరామంబును, సువర్ణలేపిత లవంగ పూగనాగవల్లీ దళ భాజనంబును, పరిశుద్ధ సుగంధోదక భరిత నవమణిగణఖచిత ప్రతిగ్రహ యోగ్య పాత్రంబును, నాభోగ భోగంబులచే నయనానందకరంబైన శయనాగారంబున వివిధంబులైన మదనక్రీడలం దృప్తిబొంది నిద్రాముద్రితనేత్రలై శయనించి రంత. 171

గీ. రాత్రి తన స్వాధికారభరంబు చాల
తక్కువగుటకు చింతించి తత్తరించి
వైరియైనట్టి యినుడు పైవచ్చుననుచు
చంద్రుడరిగెను నస్త గిరీంద్రమునకు. 172

క. చోరులబిగి జారులజిగి
మారులగాలగి మృగాంకమండల శోభా
చారుతర ధాగధగి బహు
తారావళి నైగనిగి పదంపడి జారెన్. 173

క. శుకవాహాధిక రమ్యా
ధిక మోహానుగత సురతపీడిత యువతీ
నికరైక విభీకరముగ
గృకవాకము లరచె గొక్కొరోకో యనుచున్. 174

సీ. సమయసిద్ధుడు క్రియా సముదాయంబులచేత
ఘటియించు సూతంపు ఘటిక యనగ
గాలవర్తకుడు స్వోత్కర్ష చేతంగట్టు
డంబైన ముక్తా ఫలంబనంగ
బ్రాక్సతి ముక్కురపై గీలించిన
కొమరైన తెలివెండి గుండనంగ
విరహులన్మృగముల వేటాడి చాలించి
చను మదనుని చేతి శంబమనగ

జిగి మిగుల గలిగి వట్రువ సిరుల జెంగి
తొగలరేనికి నాపదల్దోచెననుచు
వగల వెంబడి జను పడవాలు పగిది
టక్కు చెలువొంద నలవేగు చుక్క పొడిచె. 175

ఉ. అంత నిశాంత యామవతి యన్సతి కాంతుడు పశ్చిమాద్రికిం
తింతనరాని చింతజనద త్పతతిజాడను బోవ నాసికా
ప్రాంత విభూషణ స్థగత భాసిత మౌక్తికమో యనంగ న
త్యంత వలక్షకాంతిని విహాయస వీథిజరించె చంద్రుడున్. 176

క. హరి హరిదబలా ఫాలీ
ఖర పరిచితి దళన వసన బంధూక నవ
స్ఫుర దరుణ ద్యుతులోయన
నరుణ ద్యుతు లుదయ శిఖరి నల్లన బర్వెన్. 177

## -: శ్రీకృష్ణుని మేలుకొలుపు :-

గీ. వంది మాగధజనములు వాసుదేవు
సన్నిధికి వచ్చి మిక్కిలి సన్నుతింప
జొచ్చిరతులిత మధుర వచోనిరూఢి
దద్యశశ్శౌర్య సుగుణ విధానములను. 178

చ. "జయజయ దేవకీ తనయ! సారసలోచన! యాదవాన్వయా!
జయజయ రుక్మిణీ రమణ! సారసగర్భము ఖామరస్తుతా!
జయజయ పాకశాసన దృషన్నిభదేహ! ఖగేంద్రవాహనా!
జయజయ భక్తవత్సల! నిశాచర మర్దన! శౌర్యవర్ధనా! 179

సీ. శ్రుతి చోరకుండైన సోమకు ద్రుంచిన
మీనరూపస్వామి! మేలుకొనుము
గిరినీటమునుగ నుద్ధరణ మొనర్చిన
మేటి కూర్మాధిప! మేలుకొనుము
దితి సుతుమర్దించి క్షితినుద్ధరించిన
కోలాధినాయక! మేలుకొనుము
భర్మకశ్యపు జేరి భక్తుని బ్రోచిన
లీలానృకేసరి! మేలుకొనుము

కేలి బలినొంచు వామన! మేలుకొనుము
మెరయు నృపహర భృగురామ! మేలుకొనుము
సేలుగల రావణాంతక! మేలుకొనుము
నీలవసన హలాయుధ! మేలుకొనుము. 180

గీ. త్రిపుర సతుల వ్రతముల నపహరించు
మేలుగల బుద్ధరూపక! మేలుకొనుము
కలికివయ్యును దుష్టుల గర్వమణచి
మెలగి శిష్టు పాలింప మేలుకొనుము. 181

చీకటి యను మదనునిపై
బ్రాకటమగు పూర్వకుధర ఫవుడుగ్రత నా
లోకించు నుదుటి కన్నన
నా కమలాప్తుండు పొడిచె నగరిపుని దెసన్. 182

క. జక్కవలు సొక్క తొగసిరి
దక్క చకోరములు స్రుక్క ధాత్రీవిబుధుల్
మొక్క దమంబులు గుహలం
జిక్క నినుండుదయ శిఖరి శిఖరము నెక్కెన్.

గీ. ఓలి డెబ్బదిరెండు నియోగములును
సలుపు దాసులు వాకిట నిలిచినారు
చేరి మీ సేవ లొనరించు చిత్తములను
మేదినీనాథ! శ్రీకృష్ణ! మేలుకొనవె." 184

వ. అని పలుపుచున్న వంది మాగధ వాక్యంబు లాకర్ణించి మేలుకాంచి
ప్రాతః కాలకృత్యంబు లాచరించి వెడలి చని. 185

సి. వరుసతో దేవకీ వసుదేవుల భజించి
సీరపాణికి నమస్కారమొసగి
తనరార నుగ్రసేనునకు దండముబెట్టి
సేవించి సాత్యకిం దీవనొసగి
ప్రద్యుమ్న సాంబుల ప్రణతులు గైకొని
కరుణతో సుతులను గారవించి
సకలసేనాధినాయకుల మ్రొక్కులుగొని
చెలువొంద నిజసభాసీనుడగుచు

ప్రాణ సఖులును రాజులు బంధుజనులు
హితులు కవి గాయకులు పురోహితులు గొలువ
గొలువునను మంత్రిజనులను గూర్చి పలికె
నరక సురరిపునాథుని సడకల్లె. 186

## —: శ్రీకృష్ణుడు నరకునిపై దండయాత్రకు సిద్ధపడుట :—

మ. "వినుడీ! భూమికుమారదైత్యుని మహావిద్వేషకృత్యంబులున్
ఘనమయ్యెన్గరు డోరగామర లసద్గంధర్వ దిక్పాలకా
ది నివేశంబులనెల్ల గొల్లగొని వేధింపంగ జొచ్చెన్ ద్వరన్
జనివానిన్వధింపకున్న బహుదోషంబుల్ భువిన్ బుట్టెడిన్. 187

ఉ. కోంకణ టెంకణ ద్రవిడ కోసలకేకయ మాగధాది రా
జాంకములన్ హరించియు, లయంబొనరించెను వారలన్నిరా
తంకము గాగ దత్సుతల దక్కక చక్కని వారినందరిన్
బింకము తోడ బట్టి చెరబెట్టెను లీల పదారు వేలకున్, 188

క. వాగ్జాలము పని యేమీ?
రుగ్జనకము పలుకదది పరోక్షము కనగా
దిగ్జన పతుల కసాధ్యము
ప్రాగ్జోతిషపురము నెంత బలవంతులకున్. 189

ఉ. సేనలు జేరరాదు విలసిల్లగ లగ్గలు బట్టిదీసుకో
బూన తరంబుగాదు చెరవుం గడులేదు మహాపరాక్రమ
స్థానమదెట్లు చూచినను సామము గూడదు నేను దక్కయే
మానవ నాథుకైన తరమాయని సాధ్యము సేయ నిద్ధరన్. 190

క. భూచరుల కసాధ్యబిది
ఖేచర మార్గమున జనియు గినుకను నా దో
షాచరుని వధింపగ దగు
లోచన పర్వంబుగాగ లోకుల కెల్లన్. 191

వ. అని వినతా తనూభవుం డంచుటయును.

## —: గరుడాగమనము :—

శా. పక్షక్షేపణ జాతవాతహతి దిగ్భాగంబులల్లాడగా
నక్షత్రేశ నిభ ప్రభానసము పూర్ణజ్యోత్స్నలం గప్పగా
నక్షీణంబగు దేహరోచులును బాలార్కద్యుతుల్మీరగా
బక్షీంద్రుం డరుదెంచె మాధవుని శ్రీపాదాబ్జము ల్గొల్వగన్. 193

గీ. పెన్నిధానంబు గనుగొన్న పేదరీతి
నీరదంబును గనుగొన్న నెమ్మిలీల
నంబుజారిని గను చకోరంబు పగిది
నభను హరిగని ముదమంది సన్నుతించె. 194

గీ. "అఖిల వేదాంత వేద్యాయ యఘహరాయ
పావనాయ మునీంద్ర హృద్భావనాయ
రాక్షస హరాయ దీన సంరక్షణాయ
ఘననిభాయ నమోనమో" యనుచు మ్రొక్కె. 195

గీ. మ్రొక్కనను గాంచి నెమ్మది ముదము బెంచి
హస్త మస్తక సంయోగ మది ఘటించి
మేను నివురుచు దన సన్నిధానమునను
గూరుచుండగ నియమించి కుశలమెంచి. 196

వ. ఇట్లాదరింపు హరింగనుంగొని వైనతేయుండిట్లనియె. 197

ఉ. "దేవరవారి సేవకుదెంచితి మీరు దలంచినంతలో
వావిరి మీమనంబొడము వాంఛితముందగ నాకు దెల్పుడీ"
నావిని "భూమినందనను దసందగు దైత్యుని మీద యుద్ధమున్
గావగ వేగ నెమ్మునరకాసురునిన్వధియింపగా దగున్." 198

క. అనవిని సంతోషము తన
మనమునబెనగొనగ నురగమర్దను నంతన్
ఘనముగ మేనుప్పొంగెను
ననిశము వీరులకు సమరమతి వేడ్కగదా. 199

వ. అంత శ్రీకృష్ణుండు శంఖ చక్ర గదా నందక శార్ఙాది సాధనంబులు ధరియించి యుద్ధసన్నద్ధుండై ప్రయాణోన్ముఖుండై దేవకీ వసుదేవోగ్ర సేన బలభద్రాది గురుజన ప్రముఖులచేత ననుజ్ఞాతుండై గరుడవాహనా రూఢుండగు సమయంబున సాత్రాజితీదేవి సన్నిధానమునకు వచ్చి యిట్లనియె. 200

**—: సత్యభామ యుద్ధమునకు వత్తుననుట :—**

క. "వల్లభ! నీతో మది రం
జిల్లగ వచ్చెద "నటన్న" శీతాంశుముఖీ!
కొల్లలుగా వేడ్కలు వెద
జల్లుచు గన్గొనగ చలాటలటే. 201

క. అళి ఝుంకృతులే దంతా
వళ ఘీంకృతు లీ శుకాళి భాషలె హయహే
షలు కంకణ నిక్వణన
మ్ములె రథనేమీ నినాదములు తలపోయన్. 202

చెలుల పురస్కృతులె భటా
వళుల తిరస్కృతులు సాధువాదంబులె యో
ధుల నాదమ్ములు వీణా
కలరవములె వినగ జాపగుణనిస్వనముల్. 203

దురమెక్కడ నీవెక్కడ
నరుదేరగ నిలువు "మని పలికిన" నీ
మరుగున నుండుగ నాకీ
వెరపేటికి నాదుమాట వినుమిటు కృష్ణా! 204

క. నీ వెంట వచ్చి దైత్యుల
నీ వనిలో గెలువజూచి నీ జయవార్తల్
నీ వెలదుల కందరకును
వావిరి వినిపింతు మరలివచ్చెద వెన్కన్. 205

క. నను రావల దననేటికి
చనుదెంచెద"ననిన నవ్వి సమ్మతి నిటు ర
మ్మని ముందర నిడుకొని తా
వనజ దళాక్షుండు గరుడవాహన మెక్కెన్. 206

## —: సత్యాకృష్ణుల ప్రస్థానము :—

క. అప్పుడు గరుడడు రెక్కలు
విప్పి నభంబునకు నెగసి వేగమె చనుచో
నప్పద్మాక్షుడు సతితో
నిప్పుడమిం జూపి చెప్పె నిట్లని వేడ్కన్. 207

క. "అందమగు పురులు కరులును
స్యందనములు హరులు వారిజంబుల కొలనుల్
సుందర వనములు నయనా
నందము లగు కనుగొనంగ నాళీకముఖీ! 208

మ. ధరణీమండలి వింతజూడు తరుణీ! తార్క్ష్యోపరిస్థాయివై
గిరులన్నిర్ఝరులం దటాకముల నాక్రీడా ప్రవేశంబులన్
స్థిరమై యొప్పు నదీనదంబులను విచ్చేయున్ద్విజశ్రేష్ఠులన్
సిరులన్మించిన దేవతాస్థలులలో సేవల్వినోదంబులన్. 209

క. అని యిట్లుం బ్రియు రాలికి
మనమున సంతోషమొదవ మార్గములోనన్
గనబడు వింతల జూపుచు
జనియెను శాత్రవుని పురికి సామీప్యముకున్. 210

క. ''విను! మన జయము సిద్ధము
ననువొందగ మంచి శకున మయ్యెం దరుణీ!
యనుకూల మందపవనము
గనుగొన నామోద సూచకంబై తోచెన్.'' 211

శా. ఈలీలం సరసంపు ముచ్చటలచే నింపొందు సత్యాంగనా
బాలా రత్నము దాను దత్పుర సమీపస్థానమం దొక్కచో
శైలాగ్రంబున నిర్మల స్థలిని వృక్షచ్ఛాయలం జేరి గో
పాలుండుం దన శాద దీర్చుకొనగా బాటించుచో నత్తరిన్. 212

క. ఆస్తరణము గరుడండిడ
సుస్తనియుం దాను చాల సొంపుదలిర్పన్
స్వస్థముగా గూర్చుండిరి
నాస్తను తాంబూల చర్వణాది విధులచేన్. 213

క. అక్కడ భూసుతు పురమున
మొక్కరమగు దుర్నిమిత్తములు బహుదోచన్
రక్కసుడు తనదు సభలో
బొక్కుచు దన మంత్రివరుల బొడగని పలికెన్. 214

**—: నరకుని మంత్రాలోచనము :—**

మ. ''పగరే కూయ దొడంగె ఘూకములు సత్ప్రాసాద దేశంబులం
బుగులుంబుట్టి వరక్ష పల్లముల వాపోవంగ జొచ్చెన్మదిన్
వెగడుంజెందగ గాకసంఘము మహా భీమంబుగా మ్రోసె నే
పగిదో తోచదు నిద్దినంబున మహోత్పాతంబులుం బుట్టుటల్. 215

మ. మును భూలోకము రాజులం గెలిచితి స్ఫూర్తి ప్రతాపంబుసం
జని స్వర్గాధిపుడైన యింద్రుని మహోత్సాహంబు బోజేసితిన్
ఘనునగ్నిన్యముని న్నిశాచరపతిం గాండాధిపు న్వాయువున్
ధననాథుం శివునిం జయించితిని యుద్ధ క్రీడ చెన్నారగన్. 216

నా కెవ్వ డెదురు లేదని
లోకంబున దిరుగుచుంటి లోకులు మెచ్చన్
శ్రీకృష్ణుండను యాదవు
డా కంసుడాదిగా మదాప్తుల ద్రుంచెన్. 217

కంటకుడైన యాదవుని గర్వమడంచక యున్న మిక్కిలిన్
గంటికి నిద్రవచ్చునె సుఖంబులు జెందెడి వృత్తి మానసం
బంటునె వైరికోటికి భయంబులు బుట్టునె కీర్తి వచ్చునే
బంటు తనంబుచేత సులభక్రియ వాని వధింపకుండిసన్. 218

ఆలశ్యమైన సమృతము
హాలాహలమైన పగిది నరులను లీలన్
దేలగ జూచిన పనిచెడు
వాలాయము ద్వారవతికి వడి జనవలయున్." 219

అనుచుం దనయెదుటం దోచిన దుర్నిమిత్తంతబులు తన మరణ సూచకంబులని విచారించక దుర్మదంబున దుర్గర్వంబుచెంది సేనాధి పతింగనుంగొని "నీవు సమస్త సైన్యంబుల గట్టాయితంబు గావించు" మని చెప్పి మంత్రులం గనుంగొని "మీరు మీ బలంబుల గూర్చుకొని రండు ప్రాతఃకాలంబున దండయాత్రకుం జనవలెనని చెప్పిన వారలనుమతించి యిట్లనిరి. 220

ఉ. "దేవ! భవద్బలంబునను దివ్యుల గర్వమడంచి పుచ్చవా
భావలయంబు రాజులను బోరులలో వధియించి వైవవా
కేవల యాదవాధముడు కృష్ణుడొకండు భవత్ప్రతాప స
త్పావక కీలలంబడియు భస్మము గాకెటు నిల్వ నేర్చునే. 221

ఆవరణాద్రియుం జలధులాది చరాచరముల్భరించు భూ
దేవికి నందనుండవు మదిన్విలసిల్లగ సత్యశౌచ యు
త్పావనమూర్తి వెన్నిట నభశ్చరులాదిగ లోకులెల్ల నీ
సేవలు సల్పగోరుదురు చిత్రమె నీ కొక కృష్ణుగెల్వగన్. 222

క. దేవర పరిణామంబే
జీవనమని కోరుచున్న సేవకుల మమ్మున్
భావించి పంపు మేపని
గావలసిన దీర్ఘగలము కాశ్యపితనయా ! 223

ఉ. ఏము పరాక్రమంబున జయింతుము పంపు జయింపకుండిన
న్నేమరి పాటునైన వినయేచ్ఛఘటింపుచునైన సాధు గో
త్రామర వృత్తినైన వివిధంబగు మంత్ర మహౌషధంబులం
భ్రామక మొందజేసి సదుపాయము నన్వధియింతు మిప్పుడున్.'' 224

క. అనవిని మంత్రులతో భూ
తనయుం డిట్లనియె ''దైత్య దానవ మాయం
జని త్రుంచుట యర్హమె బహు
ఘనులకు యుద్ధమున రిపుల ఖండింప దగున్. 225

గీ. మీరు మీ బలంబుల గూడి మేల్కొ గలిగి
నగర మీరాత్రి కాపాడదగును మీకు
జేరుడీ యిండ్లకని'' సెలవొసంగి
తాను జనెనంతిపురికి నిద్రాభిరతిని. 226

క. ఓ మోహనాంగి! సత్యా
కామిని! సంధ్యా సమీపకాలం బయ్యెన్
నేమరి యుందురు దనుజులు
నీ మేరనె చనగవలయు నిది వేళ సుమీ. 227

క. లేలెమ్మా యోకొమ్మా !
బాలారత్నమ్మ! తార్క్ష్యుపై గూర్చొమ్మా
వాలాయము భూతనయుని
బ్రోలెల్లంజెరిచి గాసి బొందింపవలెన్." 228

అని సత్యభామ తోడను
వనజేక్షణుడంత గరుడవాహనుడై భూ
తనయుని పట్నము డగ్గరి
పెనపువ సేయంగదలచి ప్రియకిట్లనియెన్. 229

"చెనకక యిట్లూర్కుండిన
మనపై యుద్ధంబు సలుప మహిసుతు డే లీ
లను జనుదెంచును వానికి
గనలుం బుట్టుటరు దుడుకు గావించవలెన్." 230

అంత. 231

## -: కృష్ణుని ప్రాగ్జ్యోతిషపు ముట్టడి :-

గరుడపదోద్ధతి న్నిశితకాండరుహాశని పాతపద్ధతిం
గురుతర మేరుసార పటుఘోరగదాహతి నుగ్గునుగ్గుగా
ధరబడ గ్రూలద్రోచె వితతంబగు కోటలు క్రొత్తడంబులుం
స్ఫురితములైన గోపుర సమూహములం బహుకేళికావనుల్. 232

సీ. పటుజల దుర్గంబు బడబానల శర ప్ర
యుక్తి తోడుతను దచ్ఛక్తిదవలె
గంధవాహాఖ్య దుర్గంబు పర్వత బాణ
సంధానమున దాని జవమడంగె
నగ్నిదుర్గము వారుణాస్త్రఘాతంబున
జల్లారి బహుతదుగ్రచ్ఛాయను మానె
లోహాది దుర్గసమూహంబు వజ్రమ
యాంబకంబులను జూర్ణంబులయ్యె
మాటుకొన పురజనులరు చోటులేక
పాటవంబైన హరి శరఘాటికపుడు
మాటువలు గూడి యలకాల కూట హరుని
చాటి మొరపెట్టె నాసురకోటులెల్ల. 233

క. మురపాశంబుల ద్రుంచెను
కరహేతిం దోరణము లగ్గలు కోటల్
ధర గూలద్రోచె గపచే
సరభస గతినొత్తె బాంచజన్యంబంతన్. 234

## —: మురమురపుత్రులవధ :—

క. ఆనిబిడ ధ్వనివిని పం
చాసనుడగు మురనిశాటు డదరుచు నిదుర
న్మాని జలంబులు వెలువడి
నానాదిక్కులను జూచి నలినాక్షుగనెన్. 235

సీ. బిగికాశ సంధించి బిరుదువక్కాణించి
సయమైన నిజసాధనములు బూని
దిక్కులల్లాడగా జుక్కలురాలగా
నబ్బురంబుగ బెడబొబ్బవెట్టి
కన్నుల నిప్పులొల్కగ గరాశింపుచు
నట్టహాసముజేసి యవుడుగరచి
"నీ వెవ్వడవురోరి! నీ పేరుజెప్పుము
మురసుర వైరితో మోటుకొనగ

గరుడ గంధర్వయక్ష కిన్నరులునైన
నురగవరులైన నమరఖేచరులునైన
నెదుట నిల్వరు నీవునాకేమిలెక్క
పొమ్ము నెటనైన నూరక పొలియనేల." 236

అనినం గృష్ణుడు నవ్వి "యోరి మురదైత్యా! యిట్లు దుర్భాషలా
డిన నీవుం బహుశౌర్యుడవైతా జయధాపన్నిన్ను మర్దించ వ
చ్చిన వీరుండను నీకు నేరెవరో శీఘ్రంబు రప్పించు వెం
టనె వానిన్నిను ద్రుంచి వైచెద దురంతంబైన యుద్ధంబునన్". 237

క. అనిన నృకేసరి దాసరి
కిని పెను శివమెత్తి నటుల గేడింపుచు హా!
యని యదువీరునిపై నొక
ఘన గద బడవైచి పేర్చి కడువడి నార్చెన్. 238

క. కడు నార్చి వైచు పెనుగద
పొడి పొడి గావించి వాని ఘోరియురమునన్
బెడిదంబుగ నాటించెను
బిడుగును బోలిన శరంబు భీకరలీలన్. 239

క. కడుమూర్ఛ నొంది వాడును
దడవునకుం దెలిసి మేటిధనువంది జవం
బడరగ గురిసెను శరముల
జడి నగమున గప్పు మంచు చందము గాగన్. 240

క. అవి యెల్ల నైదు శరముల
నవియంగా జేసి తచ్ఛరాసము దునిమెన్
బవివంటి యొక శరంబున
దివులొందగ వాడు పైకి తెంపున వచ్చెన్. 241

ఉ. వచ్చిన యా మురాసురుని వక్షము భూరిశిలీముఖంబులన్
గ్రుచ్చిన దచ్ఛరంబు పటుఘోరతరంబుగ యోజనంబు దా
నచ్చుగ దీసుకం జని రయంబున వైచిన వాడు నాత్మలో
నచ్చెరు వంది కొంత భయమందుచు గ్రమ్మర ధైర్యచిత్తుడై. 242

వ. మరల దురాలాపంబు లాడుచు గదియఁ జని. 243

క. జ్వాలా భీలం బగు నొక
శూలము బక్షీంద్రు రొమ్ము సూటిగ వ్రేయన్
బూలవనమాల దాల్చిన
లీలం గరుడండు మది జలింపక యుండెన్. 244

అప్పుడు గరుడవాహను ధైర్యశౌర్యంబులం గాంచి మురుండు చింతా క్రాంతుండై పత్త్రపోటలంబున సంపాదించిన యాయుధంబులు నిరర్థకంబులై చనియె నేమి సేయంగలవాడ బెరికింబారి పురికి మరలంజనిన నరకవల్లభునిచేత నపమానితుండనగుదునని ధైర్యంబవలంబించి. 245

కాలదండ సమాన సంకాశమైన
శక్తి వైచెను నసుర దురుక్తులాడి
యది తృణీకారముగజేసె హరి నిశాత
సాయకముల వాడు విచారపడగ. 246

క. కుంతము గైకొని లయ సమ
యాంతకువలె దిక్కులద్రువనార్చుచు రాగా
బంతముతో దత్సాధన
మింతింతలుగాగ ద్రుంచె నిషుతతి తోడన్. 247

తోమరముంధరించి బలుదోర్బల మొప్పగవాడు సాహసో
ద్దాముడునై యుగాంతశరదంబు విధంబున ద్రోయుచున్నుర
స్తోమములెల్ల నచ్చెరువుతోడ గనుంగొనవైచె గృష్ణునిం
భీమముగా నతండు నది పిండిగజేసె శరాళి వెండియున్. 248

క. అదిగని వాడొక ముద్గర
మునటున ధరియించి భయము నొందగనైవన్
బదనుం దూపుల నదిచెడి
కొదవంబడె ఖళియటంచు కోపము హెచ్చెన్. 249

క. హెచ్చితన పంచముఖముల
జిచ్చుమియుచు ఘోరరణము సేయగ హరిదా
నచ్చెనటి దైత్యశిరములు
చెచ్చెర జక్రమున దునిమె చిత్రముగాగన్. 250

సురల హృదయములకెల్ల
స్మెరమెరగా మెలగుచున్న మేటియగు మురా
సురుడు సని గూలుటంగని
హరికిని జయపెట్టి కురిసిరలరులమర్త్యుల్. 251

తునిగిన వాని శిరంబులు
తనువును సలిలములబడిన దత్సుతులతనిం
గని శోకాతురులయ్యును
బెనకువకుం గపెసిరపుడు భీకరలీలన్. 252

గదా ఖడ్గతోమర భిండివాల శూలచక్ర ధనురాది సాధనంబులు ధరియించి ధూమ్రమనభస్వ దంతరిక్ష విభావస్వరుణ వసుశ్రవణు లనంబేరుగం మురాసురపుత్రులేడ్వురు భూనభోంతరాళంబులు నిండ సింహనాదంబులు సలుపుచు హరితోడం దలపడి ఘోరయుద్ధంబుసేయ వారలంచర ననేకాయుధంబుల హతులంగావించి సత్యయుం దానును గరుడవాహనారూఢుండై తేజరిల్లుచుండె నక్కడ చారులైన రక్కసులు నరకాసురుని వద్దకేంజని యిట్లనిరి. 253

"ఓదేవ! భూమినందన
నీ దారుణ శౌర్యమునకు నిఖిలజగంబుల్
భేదిల్లునట్టి సియా
మోదంబున కిపుడు చాలమోసము వచ్చెన్. 254

లక్షాక్షౌహిణి సేనలు
దక్షతగసలింపలేని తాపక దుర్గా
ధ్యక్షమ్ముల గూల్చెను నే
కక్షణ మాత్రంబులోన గడువెర గయ్యెన్. 255

సీ. బహుపుష్పఫలగంధ భరితోపవనముల
నేకిప్పచె
నస్త్రజలానిలానలమయ దుర్గముల్
తద్వైరి బాణసంతతుల గూల్చె
బద్మాకర తటాక బహుదీర్ఘికలయందు
నంబురి క్త విధాయకంబు సలిపె
వాతాశినీలోక పాతాళపర్యంత
పరిఖల మృచ్ఛిలాభరము నించె

విపణులెల్లను రిత్తగావించి విడిచె
కొలువుకూటంబులను నేలగూల్చద్రోచె
నెదురు తనకెవ్వరనుచు దుర్మదముతోడ
వెలయుచున్నాడు యాదవ వీరవరుడు. 256

క. మురసురవైరి సుతులతో
దురమున బరిమార్చి యధిక దోర్బలమొప్పన్
నరకాసురుడేడని త
త్పరుడై చనుదెంచె నిపుడు దనుజాధీశా!" 257

వ. అనిన విని నరకాసురుడు నాజ్యాహుతి గావించినం జ్వాలాభీలంబైన మహానలంబు చందంబున గాలంద్రొక్కిన క్రూరంబైన కాలసర్పంబు లీల మహోద్దండ దండతాడితంబైన కంఠీరవంబు విధంబున ప్రచండ కోపోద్దీపితమానసుండై దంతంబులం గీటుచు నేత్రంబుల నిప్పులురుల దండనాయకులం గనుంగొని "మీర లతి త్వరితంబుగా యుద్ధసన్నద్ధులు గండని, సైన్యంబుల నతివేగంబ తెండని" చాటిచెప్పి రానును గట్టాయితంబై వివిధంబులైన శస్త్రాస్త్రంబులు ధరియించి రణభేరి వేయించిన. 258

## —: నరకుని రణాగమనము :—

మ. గిరులెల్లం చెరిగె న్దిగ్గజములుం ఘీయంచు మ్రొగ్గె న్నిశా
కర మార్తాండులు తల్లడిల్లిరిల నక్షత్రంబులు వ్రాలె ఖే
చరులెల్లం ఘన మూర్ఛనొందిరి విరాజద్గాఢ నిర్ఘాత దు
ర్ధర కల్పాంత ఘనధ్వని స్ఫురిత గోత్రాపుత్ర భేరీధ్వనిన్. 259

క. పూని యనేకాక్షోహిణి
సేనలు గొలువంగ వీరశేఖరులెల్లన్
వేనోళ్ళం గొనియాడగ
భూనందనుడనికి వెడలె పొగరున్వెలయన్. 260

సీ. అష్టదిగ్గజ జాతులగు మత్తమాతంగ
బలములు కోట్ల సంఖ్యలను మీర
సైంధకాహ్వయ రథాడంబరంబైన ర
థంబులు గణనాదికంబు లమర
నిర్జరపతి హయస్ఫూర్జితోత్తమములౌ
హరులు న్యర్బుదములై మెరయుచుండ
గాలకింకర నిభాకారులై మితిమీరి
పటు జవయుత వీరభటులు వెలయ

నిట్టి సేనలు తనవెంట జుట్టి కొలువ
మేరు సన్నిభమైనట్టి తేరునెక్కి
భేరి కాహళ ధ్వనులును ఘోరు కొలుప
వెడలె యుద్ధంబునకు నల్ల పుడమి సుతుడు. 261

వ. ఇట్లు చనుదెంచు దైత్యుని దారుణాగమనంబును దత్సైన్యాడంబరంబును
గనుంగొని సత్యభామకు హరి యిట్లనియె. 262

మ. ‘‘షౌలతీ! కంపవె ఘాసుతుండు మఱితో బోరాడగా వచ్చె ల
క్కలకున్మిక్కుటమైన సైన్యములతో గర్జిల్లు దైతేయ వీ
రులతో మత్తగజేంద్రయూధములతో రూఢైన తేరెక్కి దో
ర్బలి మొప్పార జగత్త్రియంబు వడిదా ఖండించు గర్వోద్ధతిన్. 267

క. అన విని కని తన మనమున
జనియించిన విస్మయంబు సమ్మోదంబున్
దనరగ నే నీతనితో
సని సేయుదు ననుచు సత్య యాత్మ దలంచెన్. 264

వ. ఇట్లు దలంచుకొని. 265

క. జడముడిచి సొమ్ము లిమ్ముగ
నిడి నీవిబిగించి చింగులివురు పరచి బల్
విడి కాశబోసి చన్గవ
నడుమ సరుల్నిలిపి కొంగు నడుమున గట్టెన్. 266

క. శౌరి సతి జూచి ‘‘తరుణీ!
వీరాలంకారములను విలసిల్లుచు నీ
వీరీతి లేచి నిల్చిన
కారణమేమని”న సిగ్గు గడలు కొనంగన్. 267

క. తలవాంచి పలుక కుండిన
“తెలిసె న్నీ చిత్తవృత్తి ధీకొని రిపులన్
గెలువంగల నాకంటెను
బల మెక్కువ గలదె నీకు ఖండసమేః తే! 268

చేడియలెల్లను సురత
క్రీడల నలయించి మగల గెలువగ నెందున్
బ్రోడలుగాక విరోధుల
తోడం బోరాడి పారద్రోలెడి వారే! 269

గురు బాహుబలమున పుర
హరు మెచ్చని వీరు చేత నబలవు నీవున్
నరకునకు నీకు నెంతయు
గరి మశకాంతరము కాదె! కామిని! తలపన్. 270

నీకిది తగదన్నను మది
గైకొన వటులైన రణము గావించు మికన్
నీ కలవి గాక యుండిన
నాకారులగెల్చు తెరగు నాకే తెల్పున్! 271

విరిబోణి! నీమనోగత
మరయుట కిట్లంటిగాక నరమర గలవా
మరి సిగ్గేటికి నీకి
త్తరి చల్లకు వచ్చి ముంత దాచగ వలెనే! 272

అని మరియు నిట్టులనియెను
"వనితామణి! మెచ్చనట్టి వార్తలు విన్నన్
జనులైన నేమియననీ;
మొనసిన సంభ్రంబు మూయ మూపడు గలదే! 273

ధరణీ సుతుడనికిదిగో
సరభసగతి వచ్చె నింక జాగేటికి నీ
కర చాతురి జూచెద" నని
హరి సతికపుడిచ్చె విల్లు నమ్ములు పొదియున్. 274

ఇచ్చిన గైకొని కవ్వడి
నెచ్చెలికి నమస్కరించి నెలత తదాజ్ఞన్
బుచ్చుక దివిని వియచ్చరు
లచ్చెరువుగ గనుగొనంగ నర్యభిముఖియై. 275

## —: సత్యభామా నరకాసురుల యుద్ధము :—

క. ధను వెక్కువెట్టి గుణ ని
స్వనము గావించి శరము సంధించి రణా
భినుతాలీఢ పదస్థితి
గని నరకాసురుని రొమ్ము గాడగ నేయన్. 256

క. వాడయ్యేటున కదరని
వాడై బలువింట వెడదవాడి శరములన్
మూడడరించిన నడుమనె
యోడక నవి దునిమె తా మహోగ్రాస్త్రములన్. 277

క. త్రుంచిన పెక్కమ్ములు వ
ర్షించె సతంపంతకంటె చిత్రమ్ముగ ల
క్షించియు వాని సితాశుగ
సంచయ మడరించి త్రుంచి జడియక మరియున్. 278

క. నిశితార్ధ చంద్రసాయక
మసదృశ గతి బరపి తచ్ఛరాసము దునుమన్
గసరుచు వాడొక బలుగద
బిసబిస వెస విసరివైచి బిట్టుగ నార్చెన్. 279

క. వైచిన తనదెస కది రా
జూచి భయంపడక నిలిచి సునిశిత పటు నా
రాచముల డురుము జేసిన
వాచా నిష్ఠురము లాడి వాడట మీదన్. 280

గీ. ఒక్క ధన్వంది వాడు మహోగ్రలీల
చంద్రహాస నిభ స్ఫురచ్ఛాత శరము
వింట నరిబోసి విడిచె వాల్గంటి మీద
నా సతియు ద్రుంచె దా నిశితాశుగముల. 281

గీ. సిగ్గు రోషంబు మనములో జెంగలింప
నగ్గలంబైన బాణంబు లందుకొనుచు
మ్రొగ్గ జేయుదు నీకాంత మురిపెమనుచు
బెగ్గటిల్లగ శరముల వృష్టి గురిసె. 282

మ. అవి యెల్లం ద్రుటిమాత్ర కాలమున మాయంజేసి సూర్యాధిక
చ్ఛవి నొప్పారు మహాశరంబులను వజ్రప్రాయతద్దేహముం
జవ మొప్పంగడు జర్జరీ కృతముగా సల్పం బహుక్రోధ సం
భవుడై పెక్కు శిఖీముఖంబులను గూర్పం ద్రుంచె వాటిన్వెసన్. 283

ధనువు దెగటార్చి మేటి రథ్యముల గూల్చి
సారథిని ద్రుంచి ధ్వజమును జక్కుజేసి
రథము బొలయించి వేగ తద్రథిక వరుల
జాలి బడజేసె సతి బాణ జాలములను. 284

క. శూలమ్మువైవ నది శర
జాలమ్మున కున్కిదక్క జటులాంబకమున్
ఫాలమ్మున నాటించిన
గాలమ్ము బడిన చేపగతి గడుస్రుక్కెన్. 285

క. స్రుక్కిద్ధర మూర్ఛిల్లిన
రక్కసునొక డతని దనదు రథమధ్యముపై
జక్కగ నిడుకొని చనియెను
గ్రక్కున నచ్చోటు బాసి కలగుచు నంతన్. 286

సవ్యాపసవ్యములుగా
నవ్యాహత బాహుశక్తి నడరించి మహా
దివ్యాశుగముల నొంచిన
గ్రవ్యాద బలంబు పరచె గన్నది గతిగాన్. 287

క. అట్లగుట జూచి సతితో
నిట్లని మురవైరి పలికె నెవ్విధమున నీ
వెట్లాడ నేర్చితి విసీ
పోట్లాట విచిత్రమయ్యెఁ బూర్ణేందుముఖీ! 288

క. గుణ నికరముతో గరకం
కణ ఝుణఝుణ రవము మెరయ గండస్థలి ద
ర్పణ రుచిర కర్ణభూషణ
మణి ధగధగదీప్తి పొలియ మలయుచు నుండున్. 289

క. దృగళిత ధళధళరుచి లా
ఘగ శిఖర ప్రభలగడవ సురరిపు నాథా
నుగ సైన్యకల కరార్భటి
నగణిత శరపాత ఘుమ ఘుమార్భటి యార్పన్. 290

క. శృంగార వీరరసములు
సంగర రంగమున జూడ జలజేక్షణయై
పొంగుచు నెలకొనె నోయన
భృంగాలక! నీదు చెలువు పొలుపొందె జుమీ! 291

క. సొంపు గనుపింప నన్నుం
గెంపు జనింపంగ రిపుని గ్రేగన్నుల వీ
క్షింపుచు శరమరి బోయుట
దెంపరివై ప్రేయుటయు నుతింప దరంబే! 292

క. బొమ్మల పెండ్లిండ్లకు రా
రమ్మని చెలులన్న బోవు రణమున కెటులన్
సమ్మతితో నరుదెంచితి
నిమ్మహి నీ ధైర్య మహిమ యెన్నిక గాగన్. 293

క. మగవారి కెదుర నిలువవు
పగవారిం గెలువ నెట్లు భావించితివో
బెగడుదు వుయ్యేల లెక్కఁగ
ఖగరాజ స్కంధమెట్టి గతి నెక్కితివో. 294

క. మును చెలుల కల కలంబులు
వినజాలని దానవెట్లు వింటివి పటహ
ధ్వను లంచల నడిపించెడి
పని కోర్వవు రిపుల నెట్లు భర్జించితివో. 295

క. వీణె సవరించి నఖర
శ్రేణిం దంత్రికల పాటసిరి బలికింపన్
జాణవుగా వెల్లెరిగితి
బాణాసనమంది గుణరవం బొనరింపన్. 296

క. చిలుకల బలికించెడి నే
ర్పులవడ దెట్లబ్బె శరము లభిమంత్రింపన్
గల కుశలత యుడుకాడవు
కలనేనియు రిపుల నెట్లు గర్జించితివో. 297

క. ధను వింద్ర ధనువు గుణని
స్వనము రుము నిలింపులెల్ల జాతకములు నే
ఘన మీవు మెరుపుగా నరి
జనశిఖి నార్చితివి నిశితసాయక వృష్టిన్. 298

క. నీ మొగమును నీ చెరగును
నీ మహిత శరాసనంబు నీ దర్శనమున్
సోముని మదనధ్వజమును
గాముని వర్ణనమ్మృతలహరిగా గంటి జూమీ! 299

క. ఈ నీ చిహ్నము లవనీ
సూనున కవి కేతు విలయ సూర్య పరిధి వై
శ్వానరముల చందంబున
గానంబడ కున్నె నీదు కదనము నందున్. 300

క. చూచిన గురిదప్పక నై
యాచకమది నరులేక నలయక బలు నా
రాచముల నొంది ధరలో
ఖేచర రిపు సైన్యములను గెలిచితి వాజిన్. 301

క. గోలవె? నీవతి సాహసు
రాలవు నిన్నభినుతింప నలవియె హరిణీ
లాలక! మెచ్చితి నిచ్చెద
వాలాయము నీకభీష్ట వస్తువు లెల్లన్." 302

వ. అనుచు జవరాలిం బ్రశంసించి వైనతేయుని బాహు పీఠంబున సుఖా
సీనులై గూర్చున్న యవసరంబున. 303

చ. ఘనముగ నిద్రజెంది వెనుకం దగమేల్కొను నట్టివాని లీ
లను వెను మూర్ఛయున్విన దొలంగి ధరాసుతు డన్ని దిక్కులం
గనుగొని వాజి హారణ నగ ప్రతిహాస శతాంగ భృత్య వీ
ర నికర సైన్యముం గడు పరాజితు లౌట నెరింగి చింతతోన్. 304

వ. తన్నుం గాపాడుచుం దన రథమధ్యంబున నుంచుకున్న దైత్య వీరునిం
గనుంగొని యిట్లనియె. 305

"ఘనతుం గల సైన్యం బెటు
జనియెం రథభట తురంగ సామజ యోధా
గ్రణులెందు బోయి రీ కథ
వినుపింపుము నాకు నిపుడు వీరవరేణ్యా"! 306

వ. అనిన వాడిట్లనియె. 307

క. "ఏ యెడ బురుషులు విండ్లుం
సాయకములు బూని రణము సలుపుదు రట్లున్
స్త్రీ యసురుల ద్రుంప న్నా
ర్యాయతి జనుదెంచె కాళరాత్రియ పోలెన్. 308

క. ఘన శర తరంగములు గల
తన శౌర్య సముద్రమునను ధనుజులముంపన్
జనుదెంచిన మృత్యువుగా
గనబడె నీకాంత చూడగా భూతనయా! 309

ఘన పురుష సన్నిధానం
బున విల్లు ధరించి శర సమూహము ముంపన్
మన సైన్యము దైన్యముచే
జనియె యథాయథలుగాగ జవమరి బెలుచన్". 310

అనిన విని కటకటంబడి పారిపోయిన సైన్యంబుల బహుప్రయత్నంబునం బురికొల్పుకొని పునర్యుద్ధ సన్నద్ధుండై శ్రీకృష్ణునిం గనుగొని యిట్లనియె. 311

**—: నరక కృష్ణుల పరస్పర నిందాలాపములు :—**

"గోపాలక! మా తోడను
భూపాలకువలెను యుద్ధమునకు వచ్చితివో?
యీపడతి రాక యుండిన
నీపటు శౌర్యంబులెల్ల నే గను గొందున్. 312

సీ. నవనీతమును దధి నవఘృత క్షీరము
ల్దొంగిలి మెసగు తెరంగు గాదు
గొల్ల బాలురతోడ జెల్లాలటకు వచ్చి
బంతులాడిన యట్టి పంతుగాదు

కసువులుగలిగిన వసతికి గోవుల
తరములాడినయట్టి తెరగుగాదు
మసలు మూయలుపన్ని పసికాపుటిల్లాండ్ర
గూడి క్రీడలు సల్పు జాడగాదు

నస్మదీయ చమూసమూహార్ణవంబు
నీది దరిజేర నీచేతగాదు కృష్ణ!
పసులకాపరి! గర్వంబు పొసగ బోదు
చనుము గోపాల! నీకు నీ సమరమేల? 313

క. ఆడది గావున యుద్ధ
క్రీడకు జెయ్యాడదయ్యె గ్రీడగ జెలువౌ
జాడను నోడితి సరి మగ
వాడెటు నాయెదుట నిలువ వచ్చునె యాజిన్. 314

క. మగవాడవయ్యు నీవీ
మగువకు విల్లిచ్చి దాని మాటున బ్రతికే
నగుబాట్లకు వెరవవుగా
నగధర! నీవెరులెల్ల నగరే జగతిన్. 315

ఉ. వ్రీడ దొలంగి నీదు నలివేణి రణంబొనరింప జూచుచుం
చేడి తనంబు బూని నెరబింకముమాని జడుండవై మొగం
బోడక మసంబుగ బ్రయోజకునింబలె నీవునిల్చినం
జూడజగంబు వారలకు జోద్యముగాదె భవత్ప్రతాపముల్." 316

వ. అనిన శ్రీకృష్ణుండిట్లనియె. 317

శా. ఓరోరీ! నరకాసురా! వినుమునీ యుర్వీకభావంబు నా
గోరక్షత్వము శౌర్యశాలివగుచుం ఘోరాజిలో నిల్వుమీ!
వీరాగ్రేసురులెల్ల మెచ్చగను వేవిల్లని శౌర్యంబునం
బోరాడంగలవచ్చు నీదు ఛలముంబోనాడు దౌర్బల్యమున్. 318

సీ. పరగ గోరక్షణ బ్రాహ్మణ రక్షణ
లవిమాకు సహజంబులనగ వినవె
లలితమౌ క్షత్రియ కులము వాడనుగాని
చండ దైతేయ కులుండగాను
సుదతి రణక్రీడ సొంపుజూచితిగాని
నేను విల్లందితే నీవు నిల్వ
గలవె బ్రహ్మయు నీలకంఠుడు మొదలైన
దేవతల్నాదిక్కు దేరి చూడ

గలరె నీవు తృణప్రాయమెలిమి తెలియ
లజ్జ లేకను నీవు నాపజ్జకిపుడు
యుద్ధ మొనరింప వచ్చితే యుర్వితనయ!
మగువయే చాలు నీదు దుర్మద మడంప." 319

వ. అనిన వాడిట్లనియె. 320

క. "మగువ ధనుశ్శరములు గొని
పగతురతో రణముసల్ప బతిగను గొనుచున్
మగటిమికి బాసియుండ
న్నగు బాటగుగాదె సకల నగరములందున్. 321

క. నీలావు దెలిసె నీ యి
ల్లాలికి విల్లమ్ము లిచ్చినప్పుడె పోరన్
జాలవు మాతోనిక గో
పాలక! పొమ్మ"నిన శౌరి పలికె న్నగుచున్. 322

క. "నారీమణితో మార్కొని
పోరాదగలేక పారిపోయినచో నీ
శూరత్వము దెలిసె నిక్షీ!
నోరెత్తకు"మనిన భూతనూజుండలుకన్. 323

"జలధిం జారిన కానన
ముల దూరిన ప్రవేశముల దేరిన రా
కలిమిం గేరిన మసరం
జిలమీరిన కలికి వగల జేరిననెసన్. 324

నిను బోని త్తునె విక్రమ
ఖనివైనను నడరు మనికి గాకుండిక స
య్యనను శరణుం జొరుమిక
ననినం గృష్ణుంతు పలికె సత్యాగ్రుండై. 325

"ఓరీ నరక నిశాచర!
పోరక నీలావు నాదు పోటరి తనమున్
నూరక తెలియగ వచ్చునె
బీరమ్ము నిట్టులేం ప్రేలెదవ"నుచున్. 326

## —: నరక వధ :—

గొనమున శతఘ్నినామక
ఘనదివ్యాస్త్రంబు దొడిగి కర్ణాంతముగా
ధనువు దెగదీసి వేసిన
దనుజబలోద్ధతులణంగె దత్సమయమునన్. 327

శరముం హరుల గదన్మద
కరుల నరిందితిజవరుల ఖండించిన న
య్యరి సైన్యము దైన్యంబున
హరి కెదురగ లేక పరచె హాహాయనుచున్. 328

హరిని స్సత్యను మూపున
ధరియించియు గరుడడపుడు తన పనసఖరో
త్కరమున ముక్కున రెక్కల
సురరిపు కరి బలమునొంచె శూరతమెరయన్. 329

క. మరియును ఖగపతి రెక్కల
కరువలి యురుపడికి వెరచి కంపింపక లో
నరుదందుచు బురిముఖమై
పరచెను హతశేషమైన పరబలమంతన్. 330

వ. అంత నరకాసురుండు. 331

శా. కేలన్విల్లు ధరించి వాడం హరింగేలించి క్రూరానల
జ్వాలాభీల శరంబునుం దొడగి రక్షశ్రేణులుప్పొంగ "గో
పాలా! నాబలసంపదంగనుము శుంభల్లీలలన్వేగము
ద్వేలంబౌ భవదీయగర్వమును ఛేదింతుస్మదీయాస్త్రమున్." 332

క. అనునంతలోపలను త
ద్ధనువును గాండంబు వాని ధ్వజమును మిగులన్
దునకలుగా బడవైచెను
దనశాత శిలీముఖాళి దనుజులు చెదరన్. 333

గీ. అంతవాడల్క మీరంగ బంతగించి
పొంతనున్నట్టి యొకవిల్లు సంతరించి
యంతకుని పోలె క్రోధ దుర్దాంతుడగుచు
వింత శరవృష్టిగురిసె శ్రీకాంతుమీద. 334

గీ. మంచు నిరసించు సూర్యునిమాడ్కినపుడు
వాని శరముం నొక దివ్య బాణమునను
విరియజేసిన వాడు నచ్చెరువు నంది
చింతచే వీనినెట్లు జయింతుననుచు. 335

క. [1]ఆగ్నేయ బాణమప్పుడు
ప్రజ్ఞను దంపోసి కృష్ణుపై నడరింపన్
విజ్ఞాని వహ్ని సిరివరు
నాజ్ఞా ధారకుడు గనుక సూర్కుండెన్.

1. ప్రాసవై పరీత్యము.

ఉ. వాఁడు దురాగ్రహంబునను వారుణ బాణము వైవ శౌరియుం
దోడనె వాని శౌర్యమును ద్రుంగగ వాయుశిలీ ముఖంబు బ
ల్వేడుకతోడ దాను నవలీల బ్రయోగము సల్పునంత వా
డోడక పర్వతాస్త్రము సముద్ధతి తోడుతవైవ వెండియున్. 337

శా. దంభోళ్యాహ్వయ సాయకంబును మహోద్దండంబుగా శౌరి దో
ర్దంభ ప్రక్రియ నారిగూర్చి యది కర్ణాంతంబుగా దీసియు
న్నుంభల్లీలను బర్వతాస్త్రము వడిం జూర్ణంబు గావించియు
న్సంభావింపక రథ్యసారథి ధ్వజచ్ఛత్రంబులం ద్రుంచినన్. 338

క. అడిదంబు బలక గైకొని
బెడిదంబుగ రథము దుంకి భీకర లీలం
గడుపడి గృష్ణుని గవయగ
గుడుసుంగైదువను వాని కుత్తుక ద్రుంచెన్. 339

క. త్రుంచిన వాని శిరంబు స
మంచిత కోటీర కుండలాగ్ర ప్రభ వె
ల్గించుచు నేలం గూలెను
మించిన హరిపాదముల సమీపము నందున్. 340

వ. అంత. 341

చ. మొరసెను దేవదుందుభు లమోఘములై బహుపుష్పవర్షము
ల్గురిసిరి నిర్జరుల్కడన కుంఠితలీలల మేనకాదికా
ప్సర నికరంబు లెల్ల రభసంబుగ నాడిరి నారదాదులు
న్సిరులు చెలంగ బాడిరి విశేషముగా హరికీర్తివీణలన్. 342

—: భూదేవి భగదత్తునితో కృష్ణుని దర్శింపవచ్చుట :—

క. మరియు హరి భూమి పుత్రుని
దరమున దున్మాడి వేడ్కతోడుతనుండెన్
ధరణీ సతి ప్రౌఢకునితో
శరణు జొరన్వచ్చె నతని సన్నిధి కపుడున్. 343

అరుదెంచిమెల్లమెల్లన
కరిహయభట భూరి రుధిర కౌశిక భూతో
త్కర భయదభంగ సంగర
ధరణి న్వారియున్న కతన తగ ముద మెసగన్. 344

ఉ. అంతట గాంచె భూయువతి యద్రిధరుం గమలా మనోహరుం
గంతుగురుం భవాంబుభవగర్భ బిడౌజ ముఖాది వందితా
త్యంతవిలాస కౌస్తుభగదాబ్జ శరాసన చక్రసందాకా
క్రాంతభురాధరుం శ్రితజనాంచిత రక్షణసత్కృపాకరున్. 345

ఇట్లు కాంచి సర్వాంతర్యామిత్వ సర్వజ్ఞత్వ సర్వపరిపూర్ణత్వ నిర్వికల్ప
నిజవినోద విస్మితాత్మండై లక్ష్మీకాంతా విలాస భాసమానుండైన
సాత్రాజితీయుత విరాజత్సైంధవు సమీపంబునకుం జని వందనాద్యర్చ
నంబు లొనరించి యిట్లని విన్నవించె. 346

సీ. నీలాభ్ర నిభకాయ! శూలాయుధ శరాయ!
నిగమాంతగేయ! శ్రీనగధరాయ!
సురరాజసన్మిత్ర! సూరిసన్నుతిపాత్ర!
భూరి సంశ్రితవన పూర్ణచైత్ర!
సుగుణ మానసంగ! ఖగమహేంద్రతురంగ!
వచనాశనస్వాంత కమలభృంగ!
వాంఛి తార్థద! భక్తవరమానస విలాస!
మహిత కౌముది నిభమందహాస!

సగుణ నిర్గుణములకును సాక్షిరూప!
బ్రహ్మభవ నేత్రకర్ణాగ్ర ప్రకటమౌను
లాపిగా గలవారల కలవి యగునె
నిన్ను నుతిసేయ దరమె యాపన్నరక్ష! 347

వ. దేవా ! పిపీలికాది యోనులందును మోహభేదభోగాభోగ సంజనితులై దుఃఖాగ్నిహోత్రంబున సంతప్యమానులై శోకశాంతిలేని శరీరాభిమానంబున మోహితులై చంచలురైన వారలకు సన్మార్గంబు జూపి పోషించు ప్రియుండవు, జగదీశ్వరుండవు, సత్యజ్ఞానానంత స్వరూపాతిశయ నిర్వికల్పుండవు, గురుండవు, విశేషకల్పాధార మశేష భూతాంతర్యామిత్వేన వర్తమాన స్వభావ నిమీలిత లోచనుండవు, అప్రమేయమననుభవమవేద్యమపరోక్షమని తెలియువారలకు భాసమాన కరతలామలక పరదైవతంబైన నీయొక్క బ్రహ్మ కీర్తనంబులైన విలాసావతార ప్రసంగ విశేషంబు లుగ్గడింపుచు కామక్రోధలోభమోహ మదరాగాది విముక్తులై శోకార్ణవంబు యుష్మద్దివ్యస్మరణ యానప్రాంతంబున దరించి భవదంఘ్రికమల రాజద్భృంభ రార్భకమానసులైన శ్రితజనుల జేరియుందురు; బాలకుని మాతాపితరులు, వ్యాధిని భేషజానీతంబైన యౌషధంబును, వాహినీశమధ్యంబున మునింగెడువాని నావయును పోషింప నిపుణత్వంబు నేరనిలీం సంసార సాగర సంగతేషణత్రయ తంతప్యమానులై మీచేత నిర్దయులైన వారిని రక్షింప నితరుండు సాధ్యతుండుగాడు; నిష్ప్రపంచంబైన జగంబు బ్రహ్మారోపంబున స్వరూపాతి శయనంబు నొందించు స్వర్గాధ్యక్షుండవునీవ! నితర ముముక్షుండవు, నిరంజనుండవు భవపథీనంబైన పురుషునికి నీయుపదేశంబున మాతృజనకాది మమత్వ సంసార పావక దందహ్యమా నునింజేయక కృతార్థులం జేయుచుండు విట్టి మహానుభావుండవని యెరుంగక యీ నరకదానవుండు రజస్తమోగుణావృత జడమానస కృతాపరాధుండై రంగదభంగ సంగరంబున మీచేత నిహతుండై ముముక్షుండయ్యె; దుర్విజన శిక్షణంబును, శిష్టజనపోషణంబును మీకు నైసర్గికంబు లని'' వినుతించి యమ్మహాత్మునకు పాశభృచ్ఛత్రంబును అదితి కుండలంబులు సమర్పించి యనేక సాష్టాంగ వందనార్చనంబులు సలిపి పాత్రుండైన భగదత్తుంజూపి యిట్లనియె. 348

క. ''బాలుడు యుష్మత్కృపనను
మాలతవర్తించు బుద్ధికుశలుడు మృదువా
గ్జాలుడు సతరక్షణ! వన
మాలీ! రక్షింపదగిన మాన్యుడు మీకున్. 349

క. కరుణించి నరకదైత్యుని
పురమున కరుదెంచి వాని పుత్రుననును సు
స్థిరముగ బట్టము గట్టియు
విరివిగ ద్వారకకు మీరు వేంచేయదగున్". 350

మ. అను భూదేవి ప్రియానులాపముల కర్ణానందముం జెంది య
న్ననచే మిక్కిలి గౌరవించభయదానంబిచ్చి ప్రాగ్జ్యోతిషం
బునకుం జొచ్చెను సత్యదానును రయంబుస్మీర బక్షీంద్రవా
హనుడద్ధాత్రియు భూమి పౌత్రకుడు నత్యాసక్తితం గొల్వగన్. 351

గీ. రాజమార్గంబునను హరిరాకగాంచి
పసిడిమేడల పైనుండి పడతులెల్ల
లాజలును బుష్పములను నీరాజనములు
వెసనమర్పించిరా యదువీరునకును. 352

క. భగవంతుడని యెరుంగక
జగతీసుతుడితనితోడ సలిపెనువైరం
బెగముచు గన్నుంగానక
తగరు బలిసి కొండతోడ దాకినలీలన్. 353

క. అని పెక్కువిధములను హరి
గొనియాడుచు భూమిపుత్రకుని తోడుత దు
ర్జన భావము నిందించెడి
జనులనుగని శౌరినగుచు జనుదేరంగాన్. 354

క. భూదేవియు భగదత్తుడు
యాదవ విభునకును మణిమయాంచిత సౌధం
బాదట నొసగిరి విడిదిగ
సాదరమున నర్చనములు సలిపిరి వేడ్కన్. 355

వ. అంత శ్రీకృష్ణుండు సత్యాసమేతుండై సకల పూజా విధానంబులం సంతృప్తుండై సంతోషాతిశయంబున భగవత్తుంజూచి "జనకునకు బరలోక కృత్యంబులు నిర్వర్తించి పరిశుద్ధుండ వై రమ్మ"నిన నతండట్ల జేసి పవిత్రుండై సన్నిధానంబునకు వచ్చి సాష్టాంగదండ ప్రణామంబు లాచరించిన శుభముహూర్తంబున సమస్త పుణ్యనదీ జలంబులం దెప్పించి యభిషిక్తుంగావించి రాజయోగ్యాలంకారంబులైన మణిభూషణంబులను సువర్ణచేలంబుల నలంకృతుంజేసి పితృరాజ్య సింహాసనస్థుంగావించి లలాటంబున మణిమయ పట్టంబు గట్టించి సమస్త రాజలోకంబు చేత బహుమానితుంజేయించి బ్రాహ్మణజనంబులకు గోహిరణ్య రథగజ తురగాందోళికాగ్రహారాది దానంబులొసంగి స్వస్తి పుణ్యాహవచనంబులు చదివించి యాశీర్వాదంబుగావించి "నీవు బుద్ధిమంతుడవై జగద్విరోధంబు లేక రాజ్యంబుసేయుమని" చెప్పికొన్ని దినంబులు వసించి పట్టణ శృంగారంబవలోకించుటకునై గృహంబు వెడలిచని. 356

చ. కొలువు హజారముల్పసిడి గోపురముల్మణి చిత్రహర్మ్యముల్
నెలశిల లింద్రనీలములనిగ్గులు పచ్చలు కెంపురాంచె
విలసితమైన పణ్యముల వీథులు జూచుచు రాగనొక్కచో
వెలయగ గాంచెశౌరి మణి విస్తృతమౌనొక సౌధరాజమున్. 357

క. కాంచియు నవమణి ఘటితో
దంచిత శృంగారమహిమ కచ్చెరు వడుచుం
గొంచక తద్గృహము ప్రవే
శించె దదంతరమునందు జెల్వొ గనంగన్. 358

వ. ఇట్లు ప్రవేశించి. 359

## —: కృష్ణరాజ కన్యకల పరస్పర సందర్శనము :—

మ. కనియెం గృష్ణుడు తద్గృహంబునను రాకాచంద్ర సంకాశితా
ననలం జంచల నేత్రలం గనకసూన ప్రస్ఫురన్నాసలం
ఘనవేణీ విలసద్విలాసలను గోకద్వంద్వ వక్షోజయు
గ్మనలోత్కృష్టన మధ్యలన్వితత శృంగారైక రాట్కన్యలన్. 360

